శ్రీ

# మదాలసా నాటకము.



ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారి జ్యేష్ఠపుత్రుఁడగు కె. శత్రుఘ్నరావు చేఁ

ప్రకటింపఁబడియె.

రెండవకూర్పు.



బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1926.



వెల రు. 1—0—0

# పత్రిక.

ఆర్యులారా!

ఇంతకుమున్ను నాచే రచియింపఁబడిన "సునందనీ - సుఖమంజరీ" నాటకంబులు కేవలనూతనంబుగానుండుటచే మదీయాప్తులొకరు పౌరాణికకథ నొకటి నాటకరూపకంబుగాఁ జేయుమని నాకుహితముపదేశించిరి. పురాణస్థమై, సారస్యముచేఁ జెన్నొంది, హితనీతిబోధకమై, యిదివఱకు నాటకంబుగా నెవరు రచింపని కథ యెద్దియని యాలోచింప, మార్కండేయ పురాణంబులోని మదాలసా చరిత్ర యొకటి సరియయినదని నాకుందోఁచెను.

ఈకథ పెంచిన పెల్లను బెకుగునట్టిది. పురాణస్థముగానుండు కొంత భాగంబునే సంక్షేపించితి. కొంతభాగంబు నెక్కువగాఁజేర్చితి. ఈ మార్పులనుండి ముఖ్యమగు కథకు నెట్టిలోపంబు లేదుగాన నివి నాటక గ్రంథకర్తల స్వాతంత్ర్యము లోనివిగా నెంచి యటులుగావించితి. సంక్షేపించుటకుఁ గారణంబు ప్రదర్శించు కాలంబు హెచ్చువనుకీతి. హెచ్చించుటకుఁ గారణంబు తగ్గించినకథ పొందుట.

ఇటని విన్నవించు సుజనవిధేయుఁడు,

కోలాచలం శ్రీనివాసరావు.

ఈ నాటకమునందలి ముఖ్యపాత్రములు.

పురుషులు.

శత్రుజిత్తు:—కువలయాశ్వుని తండ్రి
కువలయాశ్వుఁడు:—ఋతుధ్వజుండని మఱియొక పేరు:—శత్రుజిత్తు పుత్రుఁడు
గాలవుఁడు:—మహాఋషి
అశ్వతరుఁడు:—నాగరాజు
దేవలుఁడు } అశ్వతరుని కొమారులు
నాగలుఁడు } కువలయాశ్వుని మిత్రులు
పాతాళకేతుఁడు:—రాక్షసాధిపుఁడు
తాళకేతుఁడు:—పాతాళకేతుని తమ్ముఁడు
ప్రలంబుఁడు:—పాతాళకేతుని మంత్రి.

స్త్రీపాత్రములు.

మదాలస:—విశ్వావసుండను గంధర్వరాజుకూఁతురు. కువలయాశ్వుని భార్య.
మనోరమ } మదాలస చెలికత్తెలు
కనకాంగి }
కుండల:—యోగిని - పాతాళలోకంబున మదాలసను బోషించిన మహాను భావురాలు.



శ్రీరామాయనమః.

## కృతికర్త సేయు దేవతాప్రార్థన.

శా. శ్రీరంజిల్లఁగ గాధిజాధ్వరము నిర్విఘ్నంబుగావించి, శ్రీ
గౌరీకాంతుశరాసనంబుఁ బోడిగాఖండించి, సంప్రీతిచే
శ్రీరామాపరరూపభూసతిసుతన్ సీతాసతిన్మున్న సు
స్మేరాంకూరముఖారవిందుఁ గొలుతున్ శ్రీరాము సద్భక్తితోన్.

ఉ. ఆతతభక్తియుక్తి, పృషదశ్వతనూభవ సేవితాంఘ్రికం
జాతకుఁ, బ్రత్నరత్నచయసంగత భాసురభూరిభూషణా
న్వీతకు, ధాతృభూతపఫణిప్రవరస్తుత పూతసద్గుణ
వ్రాతకు, లోకమాతకు, ధరాసుతసీతకు, జోతసేసెదన్.

ఉ. శ్రీశ, గిరీశ, వాసుకి, కుశేశయజన్మ, రసా, రవీందువా
రాశి, శ్రుతు, ల్వైసన్నరికరంబులుగాఁ త్రిపురాసురావళిన్
నాశమొసంగఁజేసి సురనాథులకెల్ల సుఖంబులిచ్చుభూ
తేశుఁడు ప్రోచు గావుతఁ యహీన సుఖంబులనిచ్చి మమ్ములన్.

కం. పర్వతరాజకుమారిన్
శర్వార్ధశరీరిణి; న్నిశాచరహంత్రిన్
గీర్వాణీమస్తమణిన్
శర్వాణి; న్దలఁతునీలజలధరవేణిన్.

కం. నలుమొగములవాఁగొలుతున్
బలరిపుముఖసకలదివిజవందితచరణున్
జలజాసను, సకలాగమ
నిలయున్, గలహంసగమను, నిశ్చలభక్తిన్.

కం. వాణి, నలివేణి, నబ్జజు
రాణి, న్వీతూజిత్రైణి, రక్షితభక్త
శ్రేణి,న్నవకిసలయనిభ
పాణి,న్దలఁచెదను, కీరవాణి, న్మదిలోన్.

కం. కరివదనునిమదిఁదలఁచెద
శరణాగతరక్షణైకసాహసుఁ, గరుణా
వరుణాలయు, గిరితనయా
వరనందను, నంతరాయభయపరిహారున్.

తే.గీ. వ్యాసవల్మీకభవకాళిదాసదండి
బాణభవభూతికాదిగీర్వాణకవులఁ
బ్రస్తుతించుచు నన్నయప్రభృతులైన
యాంధ్రకవులకు వందనమాచరింతు.

శ్రీ రా మా య న మః.

# మ దా ల సా నా ట క ము.

## ప్ర థ మాం క ము - ప్ర థ మ రం గ ము.

### నాం ది.

సూత్రధారుఁడు.

శా. శ్రీరామామరసింధుస్వీకృతతను శ్రీమించి సానందుఁడై
"కారుణ్యాంబునిధీ" యనన్గరికిమోక్షంబిచ్చెఁ; భక్తావనా
ధారుండల్లమదాలస న్దితిజుబాధల్బాపిరక్షించె; స
ర్వారాధ్యుండెవఁడాతఁ డీయుతయశంబారోగ్యమున్మాకిలన్.

### అ ను బం ధ ము 1.

నటి:— ఆర్యపుత్రా! ఇపుడే దైవంబును నీవునుతించినది?

సూత్ర:— నటీ ఏమి! అటుమాటలాడెదవు! ప్రపంచమునందును దైవంబొక్కఁడేగదా ?

నటి:— ఆర్యపుత్రా ! దైవంబొక్కఁడైన నిన్నిపురాణంబులేల ?

సూత్ర:— అందులకుఁ బాండిత్యఫలమే కారణము. హరిహరులొకరుగాని యిరువురుగారు. భిన్న రూపంబులుదాల్చి వేఱువేఱు నామంబులొంది సమష్టికి నొకరయ్యేయుందురు.

నటి:— ఆర్యపుత్రా! నీవిదివఱలుపకముందెంత తెలిసియుండెనో యిపుడంతయే నేఁ దెలిసితి. కించిత్తయిన హెచ్చులేదు.

సూత్ర:— నటీ! తెలిపెదవినుము. నీవిపుడు నన్నేమనిపిలెచెదవు ?

నటి:— "ఆర్యపుత్ర" యనిపిలిచెదను;

సూత్ర:— జనులిపుడు నన్నేమనిపిలెచెదరు ?

నటి:— సూత్రధారుఁడని పిలెచెదరు !

సూత్ర:— ఈ వేషముమాఱినపిదప యేమనిపిలిచెదవు ?

నటి:— "భర్త" "ఏమండీ" యని పిలిచెదను !

సూత్ర:— నాకొమాళ్ళు నన్నేమనిపిలిచెదరు ?

నటి:— "నాయనా" యనిపిలిచెదరు ?

సూత్ర:— నాతలిదండ్రులు నన్నేమనిపిలిచెదరు ?

నటి:— ఇఁకవలదు వలదు. తెలిసెను. అర్థమాయెను. ఒకనికే యెన్నిపేర్లయిన నుండవచ్చును మంచిది గజమునకు మోక్షంబిచ్చిన దైవంబని నుతించితివి నిజము హరిహరులిరువురు గజమునకు మోక్షంబిచ్చినారు. దితిజునిబాధనుండి మదాలసనుఁ గాపాడినదైవంబని పొగడితివే ! ఇదియెచ్చటికథ?

సూత్ర:— మార్కండేయ పురాణంబులోనిది.

నటి:— ఆదినాటకరూపంబునఁ జేసినవారెవరు ?

సూత్ర:— ఇదివరలో «సునందిని» «సుఖమంజరి» యను నాటకంబులు నేసినకవి.

నటి:— ఈకథ నాటకరూపంబున నిదివఱకు నెవ్వరు వ్రాసినట్లు లేదు, గానసీసభాసదుల యెుుటనీదినంబున నాకథనాటకముం బ్రదర్శింప నుత్సహించెదను. నీయభిప్రాయంబేమి?

సూత్ర:— ఆనాటకంబుఁ బ్రదర్శింపనుద్యుక్తుండనై నేనిప్పుడునిచటికి నిన్నుం బిలిచికొనివచ్చితి.

నటి:— ఆర్యపుత్ర! అటులయిననిఁక నాలస్యంబేల?

## అనుబంధము 2.

సూత్ర:— నటీ! మఱియొకతూరి దైవంబులఁ బ్రార్థించి నుతించి సభాసదులకు మ్రొక్కి కథనారంభింతము.

(లోనుండి ధ్వని)

సమస్తలోకసృష్టిస్థితి సంహారంబులకుఁ గర్తనై జగద్భర్తనై నేనుండఁ «దానవారి» యని ప్రల్లదంబులాడువాఁడెవ్వఁడు? ప్రాణాపేక్ష నుపేక్షించెఁగాఁబోలు. వానిగుండెఁజీల్చెద.

నటి:— (భీతిచేగడగడవడఁకుచు) నాథా! గుండెఁజీల్చెదనని దురుక్తులాడుచు నెవ్వఁడో వచ్చెడు శబ్దంబు వినఁబడియె; భయమయ్యెడు.

సూత్ర:— నటీ! ఇటురమ్ము వెళ్ళెదము. వాఁడు పాతాళకేతుండను రాక్షసుండు. వాఁడనినంతటి కార్యంబు సేయనోపువాఁడు.

(నిష్క్రమింతురు)

(పాతాళకేతుఁడు ప్రవేశించును)

## అనుబంధము 3.

పాతా:— (నలుదిక్కులం జూచితలయూఁచి) ఎవ్వఁడో మానవాధముండు మదాంధుండై మాటలాడి, మంథరక్షుభితాంబుధిధ్వని నిరాకరించుమామక వాగ్విన్యాసస్వానంబు విని శీఘ్రబుద్ధిఁ ఫలాయనమ్మును లోకోక్తిననుసరించి కాందిశీకుఁడయ్యెఁగాఁబోలు, పరోక్షంబున బెబ్బులి ప్రత్యక్షంబున బక్కనక్క యనుచు నానుడి యిట్టివారియందుఁగదా యన్వయించు. ఇట్టివారుగాన నేలోకంబువారు నాబారికిందట్టి కొనియున్నవారు. నాపరాక్రమంబన్ననో!

సీ. సర్వలోకంబులు సమయించునోయని
జడుఁడగు మృడుఁడు డాఁగియు నెపుడు
శతవృద్ధు; సృష్టికిశక్తిచాలదటంచు
దప్పించుఁబనియని ధాత వెఱచు
రక్షించు నెడపీఁడు పక్షపాతియటంచు
శిక్షించుననిభీతిఁ జెందు శౌరి
ఒకఁడొకఁడొకమూల నొదిగిదిగ్వరులెల్లఁ
గనుసన్నఁబనులన్ని వినుచుమనిరి

భళిరె పాకశాసనుని బలపడఁజెన్నుఁ
జావునకు సిద్ధపడియున్న జీవికైన
గుండెఝల్లను; బ్రతికినయుండవలదె
భూరిబలవిక్రమంబులు భువినియుడుగు.

భళిరే! బ్రతుకనిననిటులుండవలదా? కాదు కాదు పొరబడితి; ప్రతాపాటోపంబెం యుండిననేమి? అవమాంగల్యంబు లేని వివాహంబుగదా; ప్రతాపంబునకు నుత్సాహం మాంగల్యంబు; ఉత్సాహంబే సర్వభూతాపేక్షణీయంబు. ఉత్సాహంబునకు నిక్షేపం చంచలాక్షుల కరుణాకటాక్షంబు; వేయేల? ఉత్సాహంబునకాహ్వాన మంత్రంబే స్త్రీరత్నంబు. అతిప్రయత్నంబున నవరత్నంబులు సాధ్యంబులగు. స్త్రీరత్నంబట్టిదియా? ఆదిపురుషుని పూర్వ జననాకలిత కర్మఫలస్వరూపంబు; ఏమి వెడగుమాటలాడుచున్నాఁడను? సరి సరి వెఱ్ఱితీఱె తోఁకలిత్రొక్కఁజుట్టుమున్నట్టు కర్మను వెన్నాడి మున్నాడి చెండాడు నే నేకర్మకు ఫలంబారోపించెద స్వరాపత్మ్యమందైతిని కాఁబోలు. ఇఁక సర్వప్రయత్నంబులఁ గర్మయను నామంబే నశియింపఁ జేసి భువనైకమోహినియగు నొకమానినీ రత్నంబు సాధించెద. అర్థంబు లేని బ్రతుకు వ్యర్థఁ బగునటుల మానినీమణి లేనిమనికి కాటికోని యునికియని నాకుఁదోఁచెడు.

చ. ప్రణమితసర్వలోకజన పాలకుఁడైనను నేమి; సంపదా
ద్యనితర భోగ్యవస్తునివహాంచితుఁడైనను నేమి; మంగళా
ద్యనుభవయోగ్యమైననవయౌవనముండిన నేమి; యక్కటా
జననుత చారురూపయగు జవ్వని దారగలేని జన్మముల్,

నిజము, నిజము. జన్మమువ్యర్థము (అనుచుయోచించును)

(ప్రలంబుని ప్రవేశము)

ప్రలం:— దానవాగ్ర చక్రవర్తీ! వినమిత సమస్తదిక్పాలకమణి గణస్థగితశిరః కిరీటఘట్టన సంజాత కిణాంక విరాజితంబులగు తావకచరణకంజాతంబులకుఁ బ్రణమిల్లెద.

పాతా:— ప్రలంబా! మోదమందితి. మంత్రీ! రక్షోభటులందఱు సురక్షితంబుగఁ దమపనులందు జాగరూకత గలిగియున్నవారా?

ప్రలం:— సురాంతకా! ప్రాణాపేక్షగలవారలు భవత్కార్యోపేక్ష సేయుదురా? తావక సేవక కృత్యంబులు గొన్ని విన్నవించికొనియెద. వినుము.

సీ. దేవాయతనముల హేవాకముగఁ గూల్చి
దావాగ్నిబారికిఁ దార్చెనొకఁడు
నిజవాసములనుండు ద్విజులనెల్లరఁబట్టి
ద్విజహీనులుగఁజేసి తెచ్చెనొకఁడు
కుదురుగా మదినిల్పు ముదితాపసులనోట
మదిరాసవముఁబోసె మాన్యుఁడొకఁడు

పతిహితవ్రతలగు సతులను జెఱపట్టి
మితిలేని హింసలమెలపెనొకఁడు

గీ. సురుఁడొకండుగక నచరుఁడుగాఁజనుచున్న
గనలియసురుఁడొకఁడు గాలఁదన్నఁ
బుడమిపైనఁబడి యెమిడకుచు వాఁడహా
భటులచట్టులబలము బలుకనగునె.

పాతా:— ప్రలంబా! మెచ్చితి మెచ్చితి; ఇదిగదా యస్మత్కుల సత్కార్యంబు. మంత్రీ! ప్రాజ్య సామ్రాజ్యమునం దేకొఱంత యెక్కాలంబున నెబ్బంగిని రాదనుటకు సందియంబులేదు. అయిన నదియనుభవించుటకు మనోహ్లాదంబుండవలయునుగదా!

ప్రలం:— దానవేశా! భవద్వాక్యంబతి విచిత్రంబుగానున్నది. చింతనువంతలఁ గెడపెడు దనుయాహ్లాదంబునకు నేఁడే యంతరాయంబుగలిగె?

పాతా:— ప్రలంబా! హితమంత్రివి నీవుగాన నీయంది మఱుఁగిడుననది నా కెర్దియనులేదు. సువతిలేని సుఖంబు రిత్తయని నాకుందోఁచెను. పైఁగా.

కం. విచ్చలవిడివిహరించిన
వచ్చునెటుయశంబు? దానివలదన, స్వకులం
బచ్చువడనిలచునెటు? లిది
యిచ్చఁదలఁపవలదె! చింతకిది గతముసుమీ.

అ ను బ ం ధ ము 4.

ప్రలం:— హా హా! ఇదిగదా కాకతాళన్యాయంబు; నేనే యిప్పుడొక యోచంతంబు వినిపించ నుద్యుక్తుండనై యుంటి.

పాతా:— మంత్రీ! అదియేమి?

ప్రలం:— రాక్షసాధిపా! విశ్వావసుండను వానికూఁతురు మదాలసయను మదగజయానను నేనీదినంబునఁజూచితి. అది త్రిలోకసుందరి. నీకుందగిన కుందరదనయని దలంచితి.

కం. నవనీతకోమలాంగిని
నవనీరజపత్రలోచననునహివేణిన్
నవనమొనరింపఁగా, దా
నవనాయకవశమొనాగనాధునికైనన్.

అ ను బ ం ధ ము 5.

పాతా:— ప్రలంబా! హర్షించితి. నేనిప్పుడేవెళ్ళి యా నీరజాక్షిఁదెచ్చెద. వివాహోచిత సన్నాహంబమర్చి పాతాళలోకంబుననుండు మనమందిరంబుననుండుము. నేఁ బోయివచ్చెద.

అ ను బ ం ధ ము 6.

( నిష్క్రమింతురు )

## ద్వితీయ రంగము.

### మదాలస - మనోరమ - కనకాంగి.

### అనుబంధము 7.

మనో:— మదాలసా! చూచితే ఈ నవయౌవనోదయ విరాజితవసంత కృపావలోకనంబున నీయుద్యానవన రమాసౌభాగ్య మహాభోగం బెంత రమణీయం బైనది.

కన:— అగు నే సఖీ! కేవలపరకరుణాకటాక్షప్రాప్తిని వనరమ పుష్పవతి యయ్యె; పాణిగ్రహణంబున ఫలించునని తోఁచెడు.

మదా:— చెలులారా! మీ వినోదాలాపంబులఁ జిత్రాతిగొనుటకు లలితామోదంబు గలిగె. ఇఁకనాకు మనోమోదంబొదవెననుటకు సందియంబేమి? చూచితిరే మే సఖులారా! ఈ మలయమారుతము కుసుమరసవారిధిలో మునింగి పూర్వజన్మపుణ్యవశంబున వెలువడి, శక్తిచెడి, వడివీడి, తిన్నఁగా నడుచుచున్నయది. గంధవహుల గర్వభంగం బెల్లరకు నానందంబుగదా? చెలులారా! ఈ భూరుహమూలంబు చలువల కాలవాలంబుగనున్నది. చూచితిరే.

మనో:— సీ. కోమగారుద్రుమచారుసుమమారుతముదారు
తమిమీఱు శ్రమదీఱు తరుణీయిచట

కన:— బృందారకానంద మందారకుందార
విందాదిసుమబృందమిందుగనవె

మనో:— రంగారుబంగారుసింగారముం గేరు
పొంగారునవలుసారంగనయన

కన:— ఘనసారవనసారఘనవీచికాసార
సారకాసారసారంబుసరసి

మనో:— గీ. సాలసురసాలబాలరసాలజాల
తరులతాశోభితాధికతరముతన్వి

కన:— శుకపికార్భకవాక్సుధాసుఖకరమ్ము
సమ్మదమ్మునఁగను గొమ్మ సతివనమ్ము.

మదా:— సఖులారా! ఈ చిగురుబొంపములజిగికాంతి యెంతవింతగానున్నదే?

మనో:— సీ. కిసలయమ్ములుమారునసిచయమ్ములువాని
దెసకుఁబోవలదమ్మబిసరుహాక్షి

కన:— తమ్ములకయికయిదమ్ము లేటికిసాచె
దమ్మరుతూణజాతమ్ములవియు

మనో:— అలరుచునలరుల్లనంట కేయలివేణి
యలికులమ్ములు చాలఁనులియునచట

కన:— శుకవాణిసిరదాంశుకములదాఁపవే
శుకములుచవినూటఁజుఱుకుఁజూపు

మదా:—గీ. చాలె; వెలిమాటమూటలచాలు, మేలె
పిల్లికిజ్వరంబు వచ్చెడి కల్లలిటుల
పలుకువారికిఁ బిచ్చెన్నఁబలుకువినెడి
వారువెఱ్ఱులె; యయ్యారెవనితలార.

చెలులారా! మీ వెఱ్ఱిపలుకులుచాలు, చాలు, వినఁజాలను. ఈదిక్కు చూడుఁడి.

గీ. లతలు పెనఁగొనెఁగంటివే లలనయిచట
కన:— వనితయుయ్యేలలూఁగఁగవలదె మనకు
మనో:— చానతటి మీఁదుపుష్పాపచయమునకును
మదా:— పోదమట్టులైననిటుకందుఁపోలఁతులార.

(అనుచు చేటీలొక దిక్కునం బోవుట.)

(పాతాళకేతుఁడు ప్రవేశించి)

(స్వగతము) ఇదిగదా సౌందర్యంబు. ఔరా! ఆకులుకులాడి తిలకంబేలమసేయును.

గీ. నిండు చందురుఁడేకారిసిరజాస్య
మొగముజూచినదృష్టిదోషమగునోయనుచు
మృగమదమురక్షగానిడ్డపగిదిదోఁచు
నలికఫలకంబునందున్న తిలకకలిక.

ఈ నారీమణిని దారగఁ జేయువానిదిగదా జన్మంబు.

సీ. తొగతేనెఁబగఁబూనివగలూనఁగాఁజేయు
జిగిబిగినగుమోము సొగసుదాని
మగరాలనిగనిగల్నగఁజాలనఁగఁజాలు
జిగిగ్రాలుపలు చాలువగలదాని
బోలపుముకురములోప్పలికచాలను
లాలితమృదుక పోలములదాని
వాల్మిలు గేల్సేయఁజాల్వాలుగనుఁగవ
డాలుమేల్సొబగులఁగ్రాలుదాని

గీ. బలుకుఁబలుకుకుఁదేనియలోలుకుదాని
నింపుఁడులకింపుప్రాయంపు సొంపుదాని

జేయిబట్టినసిరులబ్బఁ జేయుదాని
గనియుఁగలయని యునికియుఁ జనునెయవని.

ఈలలనసఖీలలామలంజూడి లీలాకేళిలో మగ్నురాలయినది. దీనింబట్టి బాలులనువిడకట్టి నయవినయంబులు నెఱపి తీసుకొనిపోయెద.

(అనుచుగంభీరధ్వని నేయుట.)

కన:— మదాలసా! ఈ దిక్కునసుడిగాలి వీచినట్లు దుమ్ము రేగుచున్నది.

మనో:— అదియేమే! భయంకరమగు ధ్వనియగుచున్నది.

మదా:— సఖులారా! నిష్కారణమ్ముగ నాయొడలువడఁకసాగె.

(పాతాళకేతుఁడువచ్చి మదాలసనుఁ బట్టఁబోవుట.

పాతా:- ఉ. చిక్కితి వెందుబోవనగు సిగ్గది? బేలతనంబుమానవే
రక్కసనాథుఁడేనవఁగరాదు సమస్తజగంబులన్నియుఁ
జిక్కెనుమద్వశంబుగను సింధురయానరొ దీనినమ్మవే
చక్కనిబొమ్మనాసతిగసర్వసుఖంబులనన్నుఁ బ్రోవవే.

మదా. ఉ. దానవనాయకా వలదు; ధర్మముగాదు; విచారహీనుఁడై
మానినినిట్లుబట్టుట దిమానుషమే; కడుమాన్యమే? కటా;
మానవకన్యయేను మఱిమానవభక్షకుఁడీవు; బూనదెం
దేనిబిడాలమూషికలకెక్కటిపొందు; విరుద్ధమారయన్.

అసురవరా! ఇట్టి విరుద్ధకర్మములఁబూని యిహపరదూరుఁడవుగాక యుండుము. నన్ను విడువుము; నీతికోవిదుఁడవుగమ్ము.

పాతా:— కొమ్మా! సమ్మతిని సుఖంబిమ్మడిందునని మృదులాలాపంబులు నెఱపి నీవీరీతి ఛలాపలాపంబులకు మొదలిడితివి. వినయంబువిషంబగునను నీతిసిద్ధించె; ఇఁక బలత్కారంబే కర్జంబు.

( చెఱఁగుఁబట్టీడ్చుట )

మదా:- ఉ. ఇమ్మనుజాశినుండకట యీడ్చెడునన్నుఁ గృపావిహీనుఁడై
సమ్మతమా నెమీకిది దిశాపతులార; దినేశులార; మ్మా
నమ్మననుండమీకదిఘనమ్మె? సుఖమ్మననున్నకన్య మా
నమ్ముహరింపఁబూనెనిఁక నామొఱ నేరికి విన్నవింతయో.

పాతా:- శా. బాలా యేరికి నీమొఱల్వినుపఁగా వాంఛింతువేనుండఁగా
వాలాయంబిడినాకులోకమున నెవ్వాఁడైనసామ్యంబులే
డీలీలన్సలమూని నాకుఁ బ్రతిగా నీక్ష్యాపలాపంబులీ
వేలాయాడెదునన్నుఁగూడి సుఖివై యిష్టార్థములొందుమా.

బాలా! ఏమి నీకీ జాలతనంబు; నాకుం బ్రతిగా నీకీలోకంబున సాహాయ్యపడువాఁడెవ్వఁడును లేఁడు. నిక్కమిది. పోదము రమ్ము.

మదా:--క. జనులారా మునులారా
ఘనులారా గనరదేల కన్నులనన్నుఁ గ
వినరేలా నామొఱ పా
వనులారా; యీడ్చుచున్న వాఁడిటులకటా.

పాతా:-ఉ. మాననవతీలలామ ననుమానక నీ మనుజాధమాధముల్
బూనుట సామజంబులను బోరనమానక దోమలూను టే
కాని విచిత్రముల్గలవె కామిని? మేషము గొండ డీకొనన్
మేను దొలంగుఁగాని మఱి మేదిని వేఱుఫలంబు గల్గునే.

మదవతీ! ఇఁక నీమూర్ఖత విడువుము. నా సతివి గమ్ము.

మదా:— హా! ఈ క్రూరుని బాఱినుండి తప్పించువారేరును లేరే? అంబా! జగదంబా! నీవే గతి.

శా. దుర్వారాగ్రహపూరితుండగుచు నీదుష్టాసురేంద్రుండు దు
గ్గర్వాంధుండు స్మరస్మయాకలితుఁ డిక్కాంతారసీమన్ననున్
బర్వందున్నడి బట్టు రాహువు బలెన్ బట్టెన్ సుజాతుండయో
శర్వాణీ; జగదంబ నిన్నుఁ దలఁతు న్సన్మాన్యతన్ బ్రోవవే.

పాతా:— భామా! పెనులోభినిఁ బ్రార్థించునట్టింబలె నీవిమానవాధములను మఱియు నీ దేవతాధములను బ్రార్థించి నిరర్థకవయ్యెదవేల? నాపరాక్రమంబు విన్నవారు బంచతనొందుదురన్న నాకుం బ్రతిగ నిలుచువారుందురని దలఁచితివా? దిక్పాలురెల్లరు నేఁ బంచిన బంటులు. వారందఱు నీచరణదాసులయ్యెదరు.

చ. అనలునకానయిచ్చి యమరాధిపు వైభవమెల్ల నేర్చుదే
వనలుకానయిచ్చి వరుణాతతభాగ్యము నెల్లఁ బిల్చుదున్
వనితరొ గోరితేని సమవర్తిని కోణపుఁ గట్టఁ బంపెదన్
ధనదును మాధవున్ బనిచి దాసునిఁ జేసెద నీపదంబులన్.

చాలా! ఇఁక జాగువలదు. పాతాళమ్మున నున్న మన్మందిరంబునకు వెళ్లుదము లెమ్ము. నీవై రానిచో నీడ్చికొనిపోయెద.

మదా:— హా! కృష్ణా! దానవాంతకా! నినునమ్మితి.

సీ. రక్కసునకుఁ జిక్కి స్రుక్కి తినక్కటా
దేవరార మహానుభావ రార
పడరాని యిడుమలఁ బడితి నీచెడుగుచే
దేవరార మహానుభావ రార

మానహాని యొనర్చు మానవాశనుఁడిఁక
దేవరారమహానుభావరార
పాపపుణ్యంబులు పాటింపఁడీపాపి
దేవరారమహానుభావరార

గీ. కరుణచేనన్నుఁ గావరాకమలనయన
శరణువేఁడెదఁ బ్రోవరాశత్రుదమన
నీదుసేవకురాలను నిజముగాను
రారయబలను రక్షింపరారకృష్ణ.

పాతా:— యువతీ! ఏదీ నీ కృష్ణుఁడు రాఁడాయెనే? వాఁడుపశులకాపరియై కొండలంబడితిరిగెడునో లేక స్త్రీలోలుఁడై గోపికలచాటికింలోఁబడెనో లేక నా ధాటికిం వెఱచి మున్నీటిలోఁ మునుఁగంబడెనో తెలియకున్నది. మఱియొకతూరి బిలుపుము రానిమ్ము. నీయెదుటనేవాని నామావశిష్టునింజేసెద. ఛీ ఛీ వద వద చాలు చాలు. ఏమి వెడఁగుమాటలివి.

మదా:— ఓరీ పాపాత్మా! నా కర్మానుసారంబయ్యెడు. నీమరుక్షులచే దానవారిసేల దూషించెదవు.

గీ. నక్రవిక్రమమును వక్రముసేసిన
చక్రము సెదెనెయో చక్రధారి
కరికూయివెంటనె సరసకుఁజేరిన
జపముకుంటాయెనే భువనరక్ష
దశరూపములుదాల్చి దళితదానవుఁడగు
దశనీకుఁదగ్గనే దానవారి
హాకృష్ణయనిపిల్వ నాకృష్ణఁగాచిన
నీకృపయింకెనే నీరజాక్ష

గీ. భక్తజనులఁబ్రోచుశక్తియు వ్యనురక్తి
నీటఁగలపితేర నిక్కముగను
పాపినన్నుఁబ్రోవఁ బాడికాదని యెంచి
కోపమూని తేర పాపహారి.

పాతా:— భామా! నీప్రల్లదంబులోర్వఁజాల వెళ్లుము.

అనుబంధము 8.

(అనుచు నీడ్చికొనిపోవుట.)

(నిష్క్రమము.)

## తృతీయరంగము.

కుండల.

కుండల:— హా! హా! విధికృతంబునకు నెంతవిలపించినను దీరకయున్నది.

క. పుట్టించెను జనపాలుని
పట్టిగ; సామ్రాజ్యయుతునిఁ బతిగాఁ బాణిన్
బట్టించె; నట్టిబాపిను
గట్టాయిటు నిలిపె క్రూరకర్ముని సేవన్.

నా ప్రాప్తి యిట్లుండ విధివిదూర నేల? ప్రాణంబునకు సుఖంబు లేని ప్రపంచంబు పాడని పలువిధములఁ దలంచి ప్రాణాపాయంబునకు నెన్నిమారులు ప్రయత్నించినను నన్నియు నంతరాయంబులు గలుగుచున్నవి. దృఢప్రయత్ననై యీదినంబునఁ బంచభూతంబులు దమదమమాతృస్థానంబునఁ జేర్చుచున్న శచీసుగంధి సాక్షాత్కరించినట్లు ఆశించె. చండభానుభీకరాతపమునఁ గ్రాగి శరీరంబులోని సారంబంతయు వెలికిబుకకుచున్న సంతాపంబు వాయంజేయు తరుమూలమారుతంబు మాడ్కి నాసుగంధి సరసంపుఁబలుకులు నాకెంతో సంతసం బొనరించె; ఈకుసుమకోమలి నేడొక మానినీలలామంబుఁ బట్టిన పాపంబున నొక రాకొమరుని కరాంచితాసిధారచేఁ జెడునని వార్త వచ్చె. అందునకు నిశ్చయంబుగా నీక్రూరవ్యాఘ్రము నొక కన్యను దెచ్చి దాని సేవలో నుండుమని నాకు సెలవిచ్చె; ఈక్రూరుని బారికింజిక్కిన యుక్కన్య నాకన్న నిర్భాగ్య యని తోఁచెడు. విపద్దశనొందియున్నదాని సాంత్వనంబుల నూరడింపం బోయెదఁ; ఇంతకంటె నాకతిశయకార్యం బేమున్నది. వైళంబె వెళ్లెద.

అనుబంధము 9.

(నిష్క్రమింతురు)

## తృతీయరంగము.

మదాలస - కుండల.

కుండల:—(మూర్ఛలో మునిఁగిన మదాలసనుఁ జూచి చింతించి.)
హా! హా! ఈకుసుమకోమలగాత్రి యీక్రూరుని బారికిం దాళఁజాలక, జాలిం గాలి సోలి నేలపైఁ బ్రాలినది కాఁబోలు. అబలలు వలలాళకుల దౌష్ట్యమునకుఁ దాళుదురా? అకటా! రయింతటి సౌందర్యంబెంతకుదిగినది.

సీ. చిగురులతో గరులపొగరుల నొగిలించు
జిగిమోవి యూర్పుల సెగలఁ బొగలె
నక్కుచెక్కులు టక్కుముక్కలం చనినను
పెక్కుడుచెక్కుల నిక్కుచిక్కె

గీ. పిడుగుపడినట్లు నాపైనఁబడుచు నొడసి
పట్టిగోవును వ్యాఘ్రంబుపగిదినీడ్చె
కిరిమార్జాలమునకుఁజిక్కినవిధమునఁ
జేయునదిలేకచిక్కితిఁ జెడితిబ్రతుకు.

అమ్మా! ఇదినాయుదంతంబు వింటివిగదా; ఇఁకనీవిధంబెట్టిదైనది వినఁగోరెద.

మదా:— సఖీ! నాపేరుమదాలస విశ్వావసుండను రాజుకూఁతురు.

సీ. లేమలగుమిఁగూడి లీలలనుండఁగ
వ్రేళ్ళపై బెబ్బులిలీలనెగసి
వీతిహోత్రునిద్రొక్కు పెట్టికోతియుఁబోలె
వనమెల్లఁబఱువిడి వచ్చికుమతి
మదమేఱివిడివడు మదనోన్మదద్విర
దంబుమాడ్కిని నన్ను దఱిమిపట్టె
నురివవిలినయట్టి యూరఁబిచ్చికబలె
గడగడవడఁకుచుఁ గడునయమున

గీ. విడరపట్టకునన్నని వేఁడికొనినఁ
గసవుచేగాలి నెచ్చెలికనలుమాడ్కి
దండతాడితఫణిరీతి మండిపడుచు
లాఁగెగోవును బెబ్బులిలాఁగుకిరణి.

అమ్మా! ఆ రక్కసాధముండు నన్నులాఁగుతఱి పరిపరివిధంబుల వేఁడికొంటిని.

చ. వదలరనన్ను వెంటకుర వచ్చెదునీకు దురాపపాపముల్
మదిఁదలపోయరా విడర మానినిగోడులు నీకుదాఁకురా
వదరకురాయటంచుఁ బలుభంగులఁ గుయ్యిడినన్ భవిష్యదా
పదలనుసెంచఁడాఖలుఁడు పాపభవాశుగ భిన్నభావుఁడై.

తల్లీ కుండలా! ఇహపరభీతులెన్ని పలికినను వాఁడువినఁడయ్యె. నాగతియిటులయ్యె; అకటా! నా తలితండ్రులు ననుఁగానకయెంత చింతిల్లెదరో; ఏమిసేయుదు?

కుండల:— ఉ. ఉమ్మలికంబుసాలునిఁక యుగ్మలిపూర్వభవంబునందు మే
మెమ్మెయినేవ్రతంబులను నేవిధినోఁచితిమో గదమ్మమా
కిమ్మెయిఁబ్రాప్తమయ్యె; విధియెత్తఱిభద్రవిరోధిగాదె స
త్యమ్ముమ; దురత్యయంబిలను దైవకృతమ్మను మాట నేఁటిదే

తల్లీ! చింతిల్లకుము, పూర్వకర్మఫలాఫలంబులు తత్తత్కర్తలనుభవింపక మఱెవరనుభవింతురు?

గీ. ప్రాగ్భవాగమకర్మనిబంధనముల
బంధనంబులపాలయిపాపపుణ్య
ఫలములగుదుఃఖసుఖములుప్రాణిచెందు
వర్తమానంబునందనువార్తవినవె.

మదాలసా! ఇట్టిప్రాప్తికి దుఃఖించుట వెఱ్ఱితనము.

మదా:— తల్లీ! అటులయిన నీక్రూరునిచెఱఁజిక్కి తప్పిపోయ్యెడియాశ చందమామ గుటికలేగదా? హా తల్లీ! ఇట్టినిర్భాగ్యురాలిని నన్నేలకంటివి. హా దానవాంతకా! నిన్నునమ్మితి నీవేగతి.

## అనుబంధము 12.

కుండల:-- బిడ్డా! ఊఱడిల్లుము ఏడ్వకు.

గీ. మనుకుమచ్చిమ తేనెలోమునిసినట్టుల
మనుకసాధక; నినుఁగోరిమానవాళి
నుంచుమునిచుచు నెమ్మదినుండుమికను
సురభిపలికిన వాక్కిదిసుమ్మినిజము.

మదాలసా! నినుఁగోరిన పాతకంబున నిమ్మనుజాసనుండు మడియునని యిద్దినంబునఁ గామధేనువుపలికెఁగాన నీవుసంతసంబున నుండుము. అద్దానవాధముండు నీకరగ్రహణంబు గోరెనేని వ్రతవ్యపదేశంబున నాఱునెలలు సమయంబుగొనుము. మనకుశుభమయ్యెడు. మదాలసా! కడుబడలితివి. ఇంచుక విశ్రమించికొనుము. నేఁబోయివచ్చెద.

( నిష్క్రమము. )

## పంచమరంగము.

## అనుబంధము 13.

పాతా:— (చేతులుపిసికికొనుచు) ఎంతయాలోచన రహితుఁడను నేను? మాటలాడకమునుపు యోచన సేయనైతి. ఆతురపడితి. ఎటుబ్రతుకనెంచి మాటయిచ్చితినో తెలియదు.

ఉ. ఇమ్మెడమాఱుమాసములు నిష్టమునాకనియింతిపల్కినన్
సమ్మతియించునంటినికనైపఁగవచ్చునె యీవియోగముల్
గ్రమ్మరఁబోయినాపలుకుగాదనిపల్కిన నేమియెంచునో
నెమ్మదిరెంటినిందలఁపనేరని వానికిసౌఖ్యమబ్బునే.

ఆపూర్ణచంద్రాననకు షాణ్మాస వ్రతమఁట. అంతవఱకు నామనోభీష్టంబు సఫలంబుగాదఁట. అసమానసుఖంబనుభవింప లావణ్యతారుణ్య విభవంబుండు తఱిఁవ్రతంబులఁట తపంబులఁట ఉపవాసంబులఁట వలదనినఁ బ్రాణత్యాగంబు సేయునఁట. అంతటికి నోపినదేయాయింతి. మంచిదివేచెద. హా హా! సకలార్థంబులుండియు లోభిఁబలె ననుభవింపకయుండుట దౌర్భాగ్యముగదా;

మ. అకటా; యాఁకలిగొన్నవాని యెడమృష్టాన్నంబులన్బెట్టిదాఁ
కకుమా దీనినటంచు నానయిడినన్గష్టంబుగాదే? కటా
యికనేఁజేయుదు నేమి యాఱునెలలిం కేనాఁడు రాఁబోవునో
సకలార్థంబులవీడుకూడు కడుపూజ్యంబన్న చందంబగున్.

మంచిది యోచించినఁబ్రయోజనంబేమి? ముత్తెముపగిలినను మాటజాఱినను మరలరాదుగదా! ఇపుడు లేకున్ననేమి యికనాఱునెలలకైన సుఖంబుఁజూఱఁ గొనియెదఁగదా మంచిది వేచియుండెద; హా! అన్నిదినంబులు సోమరిగా నెటులుండుదు. ఏమిసేయుదు నిజము నిజము కాలవుండను కర్మఠియజ్ఞంబు సేయనెంచెనఁట నన్నుగాదని యెటుసేయునో చూచెద. వాని గీటడంచెద పోయెద.

అనుబంధము 14.

(నిష్క్రమింనును.)



# మదాలసానాటకము.

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

శత్రుజిత్ - ఋతుధ్వజుఁడు - గాలవుఁడు.

శత్రు:—ఉ. రాజకుమార, భూరితర రాజ్యభరంబు భరింపఁ గాఁజరా
భారము నేసి చాలనిఁకఁబట్టముఁ గట్టెదనీకు; భక్తిమై
నీరజపత్రలోచనుని నిత్యునిమానస వీధినిల్పియీ
ధారుణి నేలు సౌఖ్యముగ ధర్మ విచారవివేక ధుర్యుఁడై.

కుమారా! ఋతుధ్వజా! ఈభూరితరరాజ్యభారంబు వహించి యనేక వత్సరంబులయ్యె. సుఖదుఃఖంబులచే నీద్వంబమునీ సంసారశకటంబున నెన్నిదినంబు లీశిథిలశరీర యాత్రజరుపుచుందును. వలదు. వేసరితి; నీకుంబట్టంబుగట్టెద. రాజ్యంబుధర్మంబుగ నేలుచు సుఖంబునఁ నుండుము. నేనుగాననంబులు నేరి తపంబొనరించెద.

ఋతు:—ఉ. ఏలఁగఁజాలుదే నెటులు? నేలరతండ్రి విరాగమూని యీ
లీలలఁ గానఁజేరి మునిలీలలఁగీడ్వడఁ గోరుటల్; మహా
శ్రీలఁజెలంగిరి క్షతను జెందఁగఁగోరెడి వారలుందురే
చాలురతండ్రి? వేఁడెదను చాలను రాజ్యము నేల; బాలుఁడన్.

తండ్రీ! ఈరాజ్యభరంబు నేవహింపంజాల. ఆహారాదులు లేక కృశించి యరణ్యంబులంబర్తి తపించుట చూడంజాల. జనకా! ననుక్షమింపుము.

(గాలవఋషి ప్రవేశము.)

అనుబంధము 15.

(అందఱుదిగ్గునలేచి మునికిఁబ్రణమిల్లి యుచితాసనాసీనుంజేయుట.)

శత్రుజిత్:—మహాత్మా!

మ. అమరేశాదిదిగీశపూజితములై యానంద తేజమ్ములై
సుమనోభీష్టదపారిజాతములునై శోభిల్లు మీపాదకం
జములన్ దాసుని యుత్తమాంగమను బ్రాంచద్భృంగమున్సర్వకా
లములన్ రంజిలఁజేయు మాయమివరా లాలింపుమా సేవకున్.

(పునర్వందనంబిడి.)

ఉ. భూరిసువృష్టియయ్యె మరుభూమిఁ బరాకృతమున్ఫలించె భా
గీరథిసొచ్చె మద్గృహము; కీడ్వడురిక్తున కర్థమబ్బె నో

భూరితపోధనాఢ్య మునిపుంగవ గాలవ; మీశుభాగమం
బేరికినైనఁగల్గునెటు లెంతటిపుణ్యుఁడ నైతినో భువిన్.

తపోధనా! ధన్యుండనైతి మాన్యుండనైతి సరిరాజులలో నగ్రగణ్యుండనైతి.

గాల:—శా. ఆనందంబుననున్న వాఁడవె క్షితీశా నీవు?
శత్రు:— మీసత్కృపన్
గాల:—ఆనందంబె భవత్సతీమణికి?
శత్రు:— మీయక్షీణకారుణ్యతన్
గాల:—ఆనందంబె భవత్సుతుండరి వినాశారంభ సంరంభుఁడున్?
శత్రు:—ఆనందంబమరేంద్ర వంద్యమునివర్యా మీదుసంసేవనన్.

గాల:— భూపాలా! ముదమందితి.

ఉ. రాఁగతమేమి సంయమివరా సెలవియ్యర మీతపంబులున్
యాగములున్ను రక్షితములైకొన సాగుచునున్నవేగదా?
యాగమశాస్త్ర వేత్తలయియుందలు శిష్యులునిన్నుగొల్తురే?
కాఁగలకార్యమేమయినఁ గల్గిననానతియిమ్ము సేసెదన్.

మునిచంద్రమా! శుభాగమకారణంబును భవదాగమ కారణంబునుగనిచ్చయించితి క్షమింప వేఁడితి.

గాల:— జనపాలా! విషయంబువివరింప వ్యసనంబుగానున్నది.
శత్రు:— మునివరా! తమబోటిమహనీయులు చింతాక్రాంతులగుట విచిత్రంబుగానున్నది.

సీ. వరనూనమఱి సేసికరికుంభముననిడ్డ
పురుహూతుసిరి మత్తుఁబూరిగఅపె
తులలేనిచలమూని యిలరేనినలయింప
వెలివానికొలువున మలపినిలిపె
హయచోరుఁడని కాఱియలనిడ్డ సగరాత్మ
జులవహ్నికీలల బలిగనిచ్చె
తనకన్నధర నెన్నఁదగు మిన్నలేదన్న
క్షితిపునిదేహంబు జీల్చివ్రేల్చె

గీ. జగతి తాపసమహిమాతిశయముగనమె
జగములెల్లను భీతిలిజలదరించు
మూఁడుమూర్తులు వెఱతురుమునులుగినియ
నేలొకోయోగివర మీకునిట్టిచింత.

గాల:— జనపాలా! యదార్థంబుపలికితివి. అయిననాయుదంతంబుఁ దెలిపెదవినుమా

చ. నృపవర; యేమిదెల్పుదును; నీవువసుంధర నేలుచుండ నే
యపకృతిమాకుఁగల్గదని యాగమునొక్కటి సేయుచుండఁదో
రఁపుసురవైరి యొక్కఁడు రురౌద్రమున న్జెడఁగొట్టె; నంతనా
తపమునకుం గొఱంతయని దానవుశప్తునిఁ జేయనోడితిన్.

నృపాలా! ఆదానవుండు వజ్రకేతునికొమారుఁడు. పాతాళకేతుండనువాఁడు. వానిమరా
చారంబు దురూహ్యంబు.

శత్రు:— ఆహా! ఎంతటికర్ణకఠోరంబగు వార్తయిది.

గీ. వినఁగనోపు నెశత్రుజిద్వీరువీను
లయ్యోయింతటి ఘోరంబులవనిఁగలఁగె
యింతకోర్చినపాపాత్ముఁడేమి సేయు
నస్త్రసన్న్యాసమొనరించితకటయిపుడు.

తాపసివరా! ఇపుడే నేనస్త్రసన్న్యాసం బొనరించితి. ఆపాపాత్మునిపోకార్ప నుపాయంబు
నాకెద్దియుఁ దోఁపదు. ఏమిసేయుదు.

గాల:—క. మెచ్చితిసీ నయవినయము
సచ్చరితా భూరిరాజ్యసంపద్యుతుఁడై
హెచ్చినసుఖమున నుండక
కచ్చయుఁగకపాలలేలకాంక్షించితివో.

భూపాలా! త్రివర్గంబునకు సుఖస్థానమైన యీ గృహస్థాశ్రమంబు వదలి సన్న్యాసంబేలకోఁ
రితి. గృహస్థునకు ధర్మమార్గంబున మోక్షంబుసిద్ధంబు ధర్మమార్గంబంటె మో కంటకరహితము
సన్న్యాసమార్గంబో కఠినోపలంబులచే నిమ్నోన్నతమైనిపాతంబు యిదార్థంబు గృహస్థుచెడిన
యతియగు యతిచెడిన గతిలేదను నదివినవే? చాలు. చాలునీపూనిక.

శత్రు:— మునివరా! భవద్వాక్యంబులు వేదవాక్యంబులుగానెంచి ప్రాణంబుండువఱకు రాజ్యంబు
నేలెద. అయిననస్త్రసన్న్యాసం బొనరించితిఁగాననిఁక నేనాయుధ పాణిఁగాఁజాలను.

గాల:— అవనిపాలా! అటులయిన నాదానవుని రూపుమాపు టెటుల?

శత్రు:— తపోధనా! అందునకునుపాయం బేమియుఁదోఁపకయున్నది.

గాల:— ధారుణీశ్వరా! నాకొకమార్గంబు దోఁచినది.

శత్రు:— అదియేమి?

గాల:— ధరాధిపా! పటుప్రతాప ధురంధరుండగు నీపుత్రునింబంపినఁ గార్యంబు లన్నియుఁ గోఁ
నటులఁగొనసాగు.

శత్రు:—ఉ. నిన్న నెగన్నువిచ్చె, నెటు నేఁడుబలాన్వితుఁడౌనురారినిన్
జెన్నుఱ సేయువాఁడిది విచిత్రము, లోకమునందుగానమో?

సన్నుతసంయమివీంద్ర; సహజమ్మని మీరువలంతురేని నా
చిన్నిలచిన్నవానిని దెచెచ్చెదబంపెదయజ్ఞరక్షకై.

గాలః- క. బాలుండని వెఱవకు భూ
పాలానీసుతుండు పుట్టివెన్నన మహిమన్
భూలోకమునిర్భీతిగ
బాలించును నిజము పరమపావనమతియై.

నృపాలా! నీసుతుండు బాలుండని సంశయంబువలదు. వీఁడు నారాయణాంశ సంభూతుఁడు. దేవతా ప్రసాద లబ్ధంబైభూవలయంబు నొకదినంబునం బ్రదక్షిణంబుసేసి కువలయంబని ప్రసిద్ధినొందిన యొకయశ్వంబు నే వీనికిచ్చెద. దానినెక్కి నీకుమారుండు కువలయాశ్వుండని నామంబునొంది భూరియశంబుగాంచి ప్రపంచంబునంతయు నేకచ్ఛత్రాధిపతిగా నేలును. ఇదిగదా నీపూర్వజన్మ సుకృతఫలంబు.

శత్రు:— తపోధనా! భూరితరంబగు తమయాశీర్వాదఫలంబు దప్పునా; భవదాజ్ఞావిధేయుఁడను. ఇష్టానుసారంబు జరిగింపవచ్చును. ఇదిగో మీశిష్యుఁడు.

(అనిఋతుధ్వజుంబిలువుకొని)

క. వినరా ఋతుధ్వజా యీ
ఘనమగు కార్యంబు నెటులగడతేర్చెదవో
ఘనయశమెట్లు దెచ్చెదవో
మనకులమెట్లు లుద్ధరించిమని యెదవో భువిన్.

ఋతు:— తండ్రీ!

క. క్షత్రియజన్మంబఁట మీ
పుత్రుండఁటయిట్టి పుణ్యపురుషులదయకున్
బాత్రుండఁట యెటుచాలఁడు
ధాత్రీశ్వరకుత్సితారిదళనక్రియకున్.

జనకా! దైవంబునహాయంబైయుండ నాశక్తికిమీఱినపనియేమియుండదు. పోయివచ్చెద. మీపాదారవిందములకు నమస్కరించెద.

అ ను బ ం ధ ము 16.

గాల:— (స్వగతము) సింహంబుగడుపున సింహంబుపుట్టునుగాని నక్కపుట్టునా; (ప్రకాశముగా రాజుంజూచి) ధారుణీశ్వరా! మేముపోయివచ్చెదము.

శత్రు:— తపోధనా! నమస్కరించెదను.

(నిష్క్రమింతురు.)

## ద్వితీయ రంగము.

### గాలవుఁడు - ఋతుధ్వజుఁడు - పాతాళకేతుఁడు.

గాల:— ఋతుధ్వజా! యజ్ఞప్రారంభ సమయంబయ్యెను. సత్పురుషసమాగమనంబైనది. బ్రహ్మోద్గాతాదిఋత్విజులందఱు తటిమీఁదవచ్చిరని పలుకుచున్నవారువింటివే. ఇఁకనేయజ్ఞశాలఁ బ్రవేశించెద. నీవీద్వారంబున నిర్నిమేషుఁడవైయుండి యాదానవుని నిర్మూలంబుసేయుము. నేఁబోయివచ్చెద. ఏమఱకుము.

ఋతు:— తపోధనా! అటుసేయువాఁడను. నిర్భీతిగయజ్ఞంబు సాగనిమ్ము.

(గాలవుఁడు నిష్క్రమించును. పాతాళకేతుఁడు బ్రవేశించును.)

ఋతు:— రాక్షసాధమా! ద్వారంబుదూఱకుము నిలు నిలు (అనిత్రోసి)

చ. నిలునిలునిక్కరాక్షస, రజనీచర, నాదెసఁబాఱఁజూడరా
తులువతనంబు సాలునిఁకఁద్రుళ్ళకు, నెళ్ళకు, మళ్ళిపోకునా
చలము బలంబుమాపెదను చావునకున్వడిగట్టినోర; యో
పలవ; తపంబులన్జెఱచు పాపమునీదగు రూపుమాపదే.

ఓరీ! దానవాధమా! అరిగర్భనిర్భేదనపరుఁడై శత్రుజిన్నామంబునఁ బ్రసిద్ధినొందిన ప్రతాపవంతునిపుత్రుఁ డీద్వారంబునఁ గాపలియుండ నిర్భీతిగఁబ్రవేశింప సాహసించెదవే? ప్రాణంబుపై యాశవదలితివాయేమి?

పాతా:— చ. అరెరె; వరెరెరాచకూన; యిటులార్వఁగనేలర? బాలుఁడందువో
సరి, సరి; పాలుద్రావఁగను జక్కఁగనింటికిఁబోర; యేలపో
సర? మఱుతల్లిదండ్రులకుఁ జక్కటియొక్క కుమారుఁడీవు, నీ
తరమగునేర, ఘోరనోకదంతము సందునకైనఁగావుగా.

ఓరీ! బాలకా! పట్టిచప్పరించిన నాకదంతిసందునకైనంజాలవు. ఎన్నిమాటలాడెదవు. నీతలిదండ్రులకడకుంబోయి పాలుత్రావుము.

### అనుబంధము 17.

ఋతు:— చ. అగునగుఁగాని కానియసురాధమ; పంటికిఁజాల నేమిరా?
తగునిటులాడనీకు; నదితక్కువెనాకు? సమస్తవైరి జీ
వగములఁగ్రోలఁ గాఁడివురుబాణముఁ బంపితిఁబట్టిచూడరా
తగినదియానొగాదొ? యదితక్కువయేని మఱొక్కటంపెదన్.

(అనుచుబాణంబేయ దంతమువడితనకలాడుట.)

చ. తకతకదింధిమిధ్వనుల తాండవమాడెదవేల యోరినీ
శకమడగింతునేనిపుడె చక్కఁగనిల్వర వచ్చెఁ జూడునా

కవులయుపమలు సాలపుకలికిఁబోగడ
సాంతరమెచాలుపోయెప సాతికడకు.

(అనుచుమందాలన సమీపమునకంబోవుచుం.)

కందల:—(కువలయాశ్వునిఁజూచి సంభ్రమించి లేచి)

క. ఎవరయ్యా మీరిటు ...
నవ్వునయ్యా? క్రూరదానవాధిపుఁ డిపుడే
జవమునవచ్చుఁ గనయ్యా
యవనీతుని చేత మీకుహాని గదయ్యా.

కువల:—క. క్రూరాత్ముఁడు వాఁడెవఁడో
వారిజముఖి దెల్పు వానివధియించెదనే
మీరీతిఁ దెలియనచ్చున
నారీ, వలికెదనుబిదప నాదగువార్తల్.

నారీమణీ! భీతిఁజెందక యామదుష్టదానవుండెవ్వఁడో యుచ్చరింపుము.

కందల:—కుమారా! వాఁడు పాతాళకేతుండను క్రవ్యాదుఁడు. వాఁడుసహజపరాక్రమ విక్రముఁడే గాక శంభువరగర్వాక్షవస్త్రధారిరటుఁడు. మాయలచే శంబరమారీచ మేఘనాథుల మీఱిన వాఁడు. నీవోచెక్కుఁజెక్కిననఁగాదు పరిబాలుఁడవు. అదానవునివధించుట దుష్కరంబు.

క. ప్రాణములుండినఁబలుసా
కేనియుఁదిని బ్రతుకనగు నదేలా నీకీ
కానిపనివలదుసుమ్మా
మానితమున మనికిఁజేరి మనుమావేడ్కన్.

కువల:— మానినీమణులారా! వలదాపలలాశభీతి.

అనుబంధము 18.

చ. విడుడిఁకరాక్షసబాధమునిభీతి; మృగాయతనేత్రలార; న
మ్మడియి దెవానిఁ జంపిబిలమూలముననడ్డవైచి వచ్చితిన్
కడువడివాని సేననుసుగ్రమ్ముగఁ జిమ్మితి బాణకోటులన్
జడియనిఁకేమి కారణముచక్కఁగఁ దెల్పుడి మీయుదంతమున్.

కందల:—కుమారా! నీవచనంబమోఘమ్మని మేమువిశ్వసించితిమి హర్షాంబునిధిమునిఁగితిమి.

సీ. ఇదిగదాసుదినంబు తుదిలేని చింతలఁ
బొదలునిమ్మది శాంతి ముదమునొందె
విశ్వావసుండను విశ్వపుసుత, కన్య
సఖులతో వనకేళి సలుపుచుండ

కారంబునకు నృపులుకృతజ్ఞతాపూర్వకంబైన నొకమాటయిననాడక ప్రమానుపడిన దానింబలె నూరకయుంటిని.

క. వనుబాధించినయసురుని
యునికిభువికీర్తి త్తసేసియూఱటగలిగిం
చిన పరమాత్ముఁడవీవని
యనకూరకయుంటినేమి ఘనికొనెనొమదిన్.

కుండల:—మదాలసా! చింతింపకుము. ఋణానుబంధమున్న మరలవానిం జూచెదవు. అప్పుడైనసురుఱివాక వానింబూజింపుము. రాత్రివేళమీఱినది నిద్రాసమయంబైనది. శయనింపుము.

(అనుచు కుండలవేఱొకతావున శయనించి హెచ్చరికనుండుట)

మదాలస:—(స్వగతము)

గీ. ఎంతవలపంతఁ జిక్కిననింతులకట
కంతుసమరూపవంతునిఁ గాంతునొకని
యూఁతఁగొని కాదెభువిలోన ఖ్యాతిఁగనుట
భర్తభరియింపఁగాఁ గాదెభార్యయవుట.

భామలకుభర్తయొకఁడవశ్యకంబు. భర్తయుభార్యల పాలిజగద్భర్త కులశీలరూపయౌవన భాగ్యభరితుఁడగు భర్తదొరకుట భామలభాగ్యము. దొరికినతతిసరకు సేయకుండుట సిరి వచ్చెదనన్నను పోకాలొడ్డువిధంబు. హా! హా! ఆనవరసికశిఖామణి నాసరసనుండు తఱి మోహాస్త్రములకుజరిగిన రణంబునకునున్మనంబు రంగస్థానంబైయుండె. వాఁడుండువరకు లజ్జయే జయంబుగొనె. పిమ్మట మోహంబునకు జయంబుగలిగె. కార్యంబుమించె. ఏమిసేయనవుఁ? విరహంబెంత యగ్గలంబైన నోర్చుటమానితంబుగాని తదుద్దీపకారణంబులగు మలయానిల చంద్రచందనాదులదూషించి ప్రేలుటపిచ్చితనము కానధైర్యంబుననుండెద. బ్రహ్మవ్రాత దొంటుఖండించినటులగు. హా! హా! శుక్రోదయంబయ్యెడు సమయంబయ్యె శయనించెద.

## అనుబంధము 19.

కుండల:—(లేచి). హా! హా! ఇమ్మహినిమత్సఖి మదాలసగదా మానినీమణి. ఆపురుషుని మోహించి యున్నను వానియెదుటమాటలాడుట మానితంబు గాదనిమానెను. పిమ్మటవిరహంబగ్గలంబై వేధించినను ధైర్యంబువహించిమించె. హా! హా! ఇట్టిస్త్రీరత్నంబు దుర్లభంబు. ఎటులయిన దీనికనోభీష్టంబు ఫలింపఁజేయవలె. గాలవఋషియజ్ఞంబు సేయుచున్నవాఁడఁట. అచటనా రాకుమారుండుండునఁట. ఈనగరంబుననుండనేల? ప్రాతఃకాలంబున మత్సఖింగూడి యావిలయంబు వెలువడి గాలవాశ్రమంబునకుం బోయెద. ఇప్పుడుశయనించెద.

(నిష్క్రమణము.)

## తృతీయరంగము.

### గాలవుఁడు - కువలయాశ్వుఁడు - గాలవాశ్రమము.

కువల:— (స్వగతము) యజ్ఞరక్షాదీక్షనిన్నటితో సమాప్తంబయ్యె. రేపటిదినంబున నిచటనుండి భూసురాశీర్వాదంబులుగొని పట్టణంబునకుం బొ గాలవుండాజ్ఞయిచ్చె. ఇచటయుండినను బట్టణంబునకుఁబోయినను నామనం బొకయింతకేనిఁ సమాధానంబునొందదు. ఆచంచలాక్షినవీక్షించిన తటినుండి నామనంబతిచంచలంబైనది. ఆతరుణితనూరుచి, పురుషవశ్యౌషధంబని నేఁదలంచెద. ఆచాననసుఁజూడదు, నాతోనొకమాటయిన నాడదు. అయిననను సాధించె. ఇదివిచిత్రంబు.

ఉ. తేనియలొల్కుపల్కులను, దేటవుసీటుఁగుల్కుచేష్టలన్
గానకళాప్రవీణతనుఁ గాటుకఁదీర్చిన వాలుచూపులన్
మానినులిమ్మహిన్ బురుషు, మారుని బారికి లోఁగఁజేయఁగాఁ
బూనుదురౌర యాసుదతిపూనెను మౌనమెసాధనమ్ముగన్.

ఆకనత్కనక శుభాంగినిఁగని వచ్చినతటినుండి మనంబు లేని మనుజానింబలె నటించుచున్నవాఁడను.

అనుబంధము 20.

చ. మనసిజుఁడన్నలిన్ముచుఁడు మానసమన్మటుఁ బిల్చినీవు వే
గనఁగనుగండ్లమాటి చని కామినిచిత్తధనంబునంతఁదె
మ్మనననటుసేసెవచ్చు సమయంబున మానినివానిఁబట్టి వే
సెనుచెఱనేమి సేయనవు; స్త్రీనులకెట్టులభించు క్షేమముల్.

ఆహా! నామనంబామానిని వశంబయ్యె. మనసిజుఁడొకఁడాస్థానంబాక్రమించినను బాధింపఁడు. ఏమిసేయనగు. క్రూరాత్ముని ఖలునిసహవాసంబు నాకుం బ్రాప్తించె. ఆక్రూరుఁడు దుర్జాతిచెడుగులం గలపికొనినను వేధించెను. మారా! ఇంతక్రూరాత్ముండవిక దా యీశ్వరుఁడునిన్నుఁ బరిమార్చె.

క. జనకుఁడులోకావనుఁడే
మనసిజ! నీవీశునుదుటి మంటలఁబడి; "నా
యన" యనిచీరవె? ప్రోచెనె?
ఘనపాపిన్నిఁ జంద్రుడైనఁగాచునె కరుణన్.

చపలాపలోకనల విషయంబున్న ధీరులక్షునంబగలించి చలింపంజేయు వాఁడీవిషమశరుండు. వానికిసాహాయ్యపడువాఁడు వానిమేనమామ యీచంద్రుఁడు; అయ్యో! వీట్టిపాపనకులంబునఁ బుట్టె యిట్టిచెట్టలకు నొడిగట్టెనీఁడుకే

అనుబంధము 21.

క. సుగుణములఁ బ్రోవ నీకివి
తగునే బోధింప; నైన ధర నాచారం
బగు నిదియని నేఁ జెప్పితి
మగువా యిది మనమునందు మఱవకుమమ్మా.

మదాలసా! మఱియొకటి నీకుం దెలుప నిచ్ఛయించెద.

మదా:— తల్లీ! అదియేమి? అటు సందియించెదవు? ఏమది?

కుండల:— ఏమియును లేదు తీర్థయాత్రాభిలాష బహుదినములనుండి నా మనంబున నాటుకొనియున్నది. రేపు ప్రాతఃకాలంబునఁ బ్రయాణంబై పోవ యత్నించితి భవద్వియోగంబున కించుక దుఃఖించెద.

మదా:- ఉ. తాళఁగ నోపుదే నెటుల తల్లి; వియోగపదంబె దేహముల్
గీలిబలెన్ దహింపఁ దొడఁగెన్ మఱి నీవిఁక నన్నుఁ బాయఁగాఁ
జాలుదె ప్రాణముల్ నిలుప? సమ్మతియే యిది నీకుఁ దల్లి గా?
చాలును నీ ప్రయాణమిఁకఁ జాఁగిలి మ్రొక్కుచు వేఁడికొందు నేన్.

ఉ. ఉల్లము ఝల్లనన్ వ్యధకి యోర్వఁగలేక వితాకుపడ్డ నాఁ
డల్లన నీవు వచ్చి యధికార్తినిఁ బొందిన నన్నుఁ జూచి నీ
చల్లని కొంగు వీవనవశంబున సేదను దీర్చి యూఱటల్
వెల్లుగఁ బల్కవే? మతిఁగఁ బెంపవె? నింపవె చెల్మి? తల్లిరో.

క. ఓజననీ నీయుపకృతి
నీజన్మమునందు మఱవనిది నిజమిఁక నే
యేజన్మములుంగలవో
యాజన్మములందు మఱవనమ్మా! వినవే.

తల్లీ! ఇట్టి మహోపకారంబు సేసిన నీయట్టి మహానుభావురాలిని బాసి యీ ప్రపంచంబునఁ బ్రాణంబు లేమని యుంచికొనియుండెదను. తల్లీ! వలదు నీ ప్రయాణంబు.

కుండల:— మదాలసా! ఇట్టి కృతజ్ఞతగల నీగుణం బెంత గొప్పదియో? తనయా! ఋణానుబంధంబులు గలలవంటివి గావే; నా వియోగంబున కేల చింతించెదవు. వలదు. ఏడ్వకు కన్నీరు విడువకు. ఇది సమయంబు గాదు. మంచిది మదాలసా! ప్రయాణంబు నిలుపఁ బ్రయత్నించెద పోదము రమ్ము.

మదా:— తల్లీ! ఇప్పుడుగదా నీకరుణ వెల్లివిరిసె. మంచిది పోదము.

(నిష్క్రమణము.)

## ద్వితీయరంగము.

### ఆస్థానము.

తాళకేతుండు. ప్రలంబుండు.

తాళ:— ( స్వగతము ) ఏమియిది. అపశకునములు మహోన్నతమగు శుభోదయంబు నాకుఁ దెలియకున్నది. శుభంబుగాక వేఱొకటియుండునా ? వానినామంబువిన్నమాత్రన సర్వలోకంబులు జలదరించు. ఆదిశేషుండు వేయినోళ్లవాని గుణాతిశయంబులు పొగడుచుండు. దిక్పాలకులు వానియింటఁగట్టి కంపమోచుచుండు భటులు. మాయయా వానిపుట్టినిల్లు. మంత్రమా వానికైదండము. ఇట్టివానికెవరినుండి భయంబుగలుగును? కలుగదు. అటులయిన నాకిట్టిదుశ్శకునంబులకుఁ గారణంబేమి ! ఛీ పిచ్చియిది శకునములా కార్యాఫలాఫలంబులు తెలుపునవి.

ప్రలంబుని ప్రవేశము.

ప్రలం:— దానవాగ్రణీ! నమస్కారంబొనరించెద.

తాళ:— ప్రలంబా! ప్రేమమా! నీమొగంబేలవాడివాడి పెదవులు తటతటకొట్టుకొనుచున్నవి; స్వేద జలధియందు మునిఁగితివేల?

ప్రలం:— సురారీ ! ప్రాణభీతి దూరంబుననున్నదియని యెంచినవానికే యిట్టిదుర్లక్షణంబులు సిద్ధంబన నడియాసన్నంబైయున్న వాని కెటులుండును?

తాళ:— ప్రలంబా! ప్రాణభీతికిఁ గారణంబేమి? ఎవరినుండి?

ప్రలం:— దానవకుల నాశకునినుండి.

తాళ:— వాఁడెచటయున్న వాఁడు ?

ప్రలం:— గోద్విజముని వ్రాతమునకు దానవులనుండి యుపద్రవంబు గలుగునోయని దినదినంబీ ప్రపంచంబొకతూరి సంచరించుచున్న వాఁడు దృగ్గోచరులయిన యసురులనుఁబట్టి వధించు చున్న వాఁడు.

తాళ:— ప్రలంబా ! నీమాట లతిచిత్రంబులుగానున్నవి. భూతలంబొకదినంబున సంచరించు కెవరికి సాధ్యంబు?

ప్రలం:— సురాంతకా! ఆమానవేశ్వరునివద్దఁ గువలయంబను నొకతురంగంబున్న ది. దానిమహిమచే వాఁడింతటిశక్తిమంతుఁడై యున్న వాఁడు.

అనుబంధము 23.

తాళ:— ప్రలంబా! భయపడకుము. మిత్రమా! నాసోదరుండు మదాలసయను మానినీమణినిఁ దెచ్చి యుండెనే? పాణిగ్రహణ మహోత్సవంబాయెనా?

ప్రలం:— తాళకేతూ! ఆమానినీమణినిఁ గువలయాశ్వుండని నేఁజెప్పినమానవేశ్వరుండు పెండ్లియాడెను.

తాళ:— ఏమీ ప్రలంబా! మత్సోదరుండు వరించిదెచ్చుకొన్న కృశోదరిని నొకమనుజాధముండెటు వివాహంబాడె? ఇదియవిశ్వసనీయంబు.

ప్రలం:— తాళకేతూ! నీసోదరుండు ప్రాణంబుననుండెనగదా!

తాళ:— ప్రలంబా! ప్రలంబా! ఏమిమాటలాడెదవు నాయనుజుఁడు మృతినొందెనే?

ప్రలం:— నీసోదరుండొకరుఁడేగాక వానిరక్షకభటులందఱు నవలయాస్యునిచే మృతినొందిరి. హా! హా! ఆరాముతునికరాంచిత కృపాణము త్తెంచినదో నీసోదరునిహృదయక్షతజంబునఁ దనివి నొందక వానిసేననంతయుఁ బొదవిపట్టి కంఠరక్తంబు త్రావుచున్నయది. నాప్రాణంబులెంత గట్టివియోగాని వానికింజిక్కక నేఁటివఱకు నిలిచినవి. శేషేమున్నో; తాళకేతూ! ఆమానవ పశుండు నీయనుజుని నేలంగెడపి పలికినకఠినవచనంబులు నా హృదయంబున నీఁటెలపోటులం బోలెఁ బొడచుచున్నయవి.

మ. మనుజారి మదమేరి మత్తకరిదోమ ప్రాంచుచండంబునన్
దనుజాధీశుని నేలపైఁగెడపి బాధల్పెట్టి ఛీ, ద్రోహియం
చనిదంతంబులు గొట్టిపట్టిపెరికెన్ "హాసోదరా" యంచుని
న్ననముందున్దలపోసి పాసెనసువుల్కాసెన్సులౌన్నత్యముల్.

తాళ:— హా! హా! పాతాళకేతూ! సోదరా! ఒకనరాధమునిచే నీకెంతటిపరిభవకరమైన మరణంబు ప్రాప్తించెనే:

మ. అకటా! యెంతటిదుర్దినంబిదియొ యాహా పాపినావీనులన్
వికటోదంతములన్ని యున్ననుచుహృద్వీధిజ్వాలంబాఱుచున్
గ్రకచంబుల్బలెఁగోయసాగెనె? యహాహాకాయంబు హేయంబుగా
నిఁకనున్నేలకుఁగూల్పకున్నవియొ? యేమీ యున్నవేప్రాణముల్.

హా! హా! ఇట్టిదుఃఖకరంబగు వార్తవినియుంజనని నాహృదయంబు రాతికంటె, నుక్కుగుండు కంటె గట్టిదని నేఁదలంచెద. ప్రలంబా! దుఃఖించిన ప్రయోజనంబులేదు. ఆనరాధముని ప్రాణవాయువులు గ్రోలుటొండె నాప్రాణంబులు వదలుటొండె యిదియేకర్తవ్యాంశంబు. ప్రలంబా! వాఁడిప్పుడెచటనుండును.

ప్రలం:— తాళకేతూ! భూతలంబువిరుగుచుండును. దినముగాళిందీతీరమున నిత్యకృత్యంబునిర్వర్తించును. వారితోయుద్ధంబనర్థంబు. వాఁడుమిక్కిలి పరాక్రమశాలి యుద్ధంబునఁబరాజయంబు సిద్ధంబు. మాయచేజయము సందియంబు. వైరశుద్ధిఁగోరెదు నీవిదిచక్కఁగా యోచింపుము.

తాళ:— ప్రలంబా! నిజము హితముపదేశించితివి. నీవుసురక్షితముగా నిచటనుండుదువుగాక వాని నన్వేషించుచు నేఁగాళిందీతీరంబునకుం బోయెద. నాప్రయత్నఫలంబు ముందువిందువు పోయెద.

(నిష్క్రమణము.)

## తృతీయ రంగము.

### కాళిందీతీరము

### కృత్రిమముని - కువలయాశ్వుఁడు.

( కృత్రిమముని యోగధారణఁ బూనియుండుట. )

కువల:— ( జపంబుఁజాలించి కనులు దెఱచిన మునింగని )

గీ. శత్రుజిన్నామధరణీశుపుత్రుఁడేను
కువలయాశ్వుఁడ ద్విజసేవఁగోరిదినము
గువలయముఁజుట్టివచ్చెద; భవవినాశ
మీకువందనమిదె నేమిగులభక్తి.

( అనుచు సాష్టాంగనమస్కారంబు సేయును. )

కృత్రిమముని:-( నారాయణస్మరణఁజేసి )

మ. అనఘా! రాజకుమార! నేనిపుడుబ్రహ్మాధీనచిత్తాబ్జ
నినునర్థార్థిసురద్రుమంబుబలెఁగంటిన్ధన్యుఁడైతిన్భ

కువల:- జనునేయింతటిమాట, యోగివర, యాశాపాశవిచ్ఛేదులై
జనులన్బ్రోచుత్రిలోకపావనులుమీజన్మంబుసామాన్యమే.

కృత్రి:— రాజకుమారా! నిజముపలికితివి. అయిన నాశాపాశములు ద్రెంచివైచినవారు ప్రపంచంబున లేరు. మాబోటియోగివరులకు సైతము దారపుత్రాదులపైనాశ లేకున్నను యజ్ఞయాగాదులపై నాశయుండు. అవిధనసాధ్యంబులు. కానధనేషణకుంజిక్కి యుందుము.

చ. తలఁచితినొక్కయాగమును, దక్షిణకున్గతి లేకమానితిన్
గలదెమఱొక్కటోతయిలగౌరవవృత్తిఁదొలంగిపాడులో
భులఁగనివేఁడ, లేదిపుడుపొమ్మనవెల్వెలవాఱిదీనుఁడై
కళవళమందిచేడ్పడుటకన్నను; గార్యముమానుటొప్పదే.

రాజకుమారా ! లోభులనుయాచించిన గౌరవహానితప్ప వేఱుఫలంబులేదనితలఁచి కార్యంబు మానియుంటిని. ఇంతకుమున్ను యోగనిద్రఁజెంది నేనున్నపుడొక రాజకుమారుండువచ్చి నన్నాడించి తనగ్రైవేయకంబు యాగదక్షిణకై యిచ్చినట్టు కలగంటిని. లేచినినుఁగంటిని; ధన్యుఁడనైతినంటిని. రాకుమారా ! ఇదిగదానావృత్తాంతంబు.

కువల:— యోగివరా! ఇదిగో నాకంఠహారంబు సమర్పించితి. ఇఁకనేమియానతిచ్చెదరు.

కృత్రి:— హర్షించితి హర్షించితి; రాజకుమారా! యాగప్రారంభమునకు మున్ను వారుణజపంబీమడువులో మునిఁగిసేయవలెను. గర్వాంధీభూతచేతస్కులై శార్వరీచరులు తాపసులకుటజంబులు గాల్చుచుందురుగాన నేనుమరలివచ్చెడినంతవఱకు నిచటనుండి నాపర్ణశాలరక్షించెదవా ?

కువల:— తాపసోత్తమా! అంతకన్న నధికంబేమున్నది. శిరసావహించిచేసెదను.

కృత్రి:— ముదమందితి. నీవిఁకనద్వితీయసఖుండవయ్యెదవు. రాజకుమారా! పోయివచ్చెద. భద్రము.

(నిష్క్రమము.)

## చతుర్థరంగము.

### శత్రుజిద్రాజమందిరము.

### శత్రుజిత్తు - కృత్రిమముని - మదాలస.

శత్రు:— ఏలకో కువలయాశ్వుండు నేఁడునురాక తడసెను. ఏద్విజవరున కేక్రూరునుండేకష్టంబు సంప్రాప్తించెనో తెలియదు. కువలయాశ్వనినామంబు గుజనులకంతకుతూహలంబుగదా! ఇట్టి సుగుణాకరుఁడుండఁగన తండ్రిగదా పుత్రవంతుఁడని పిలువంబడును.

(కృత్రిమముని ప్రవేశము.)

శత్రు:— (లేచినమస్కరించినఁ గృత్రిమమునితలవంచికొని వ్యసనంబభినయించి యూరకుండుట.)

చ. మునివరమీదు రాకకుమోము మొసంగెను; మీదుమోముఁగ
న్గొనఁగడుఖేదమయ్యెడిఁ జనోగముచంద్ర సమాగమంబున
న్మనమునహర్షమొందఁ గ్రిపాడుఁ బుగనుంగొని ఖేదమందులా
గున; గతమోహదుఃఖమునకు న్గతిమేముకొ తెల్పరాదొకో.

తాపసోత్తమా! వ్యసనంబునకు నెక్కారణంబేమి?

క. తెలుపఁగవ్యసనంబయ్యెడి
తెలుపకయుండఁగరాదు తెలిసినవారిల్
తెలిపెదవినరానీసుతుఁ
డలఘుపరాక్రముఁడు మడిసె నసురునిచేతన్.

నృపాలా! పాతాళకేతుని సోదరుండగు తాళకేతుండను దనుయన్ననునీ సుతుండు చంపి వాఁడు వరించినవనితను వివాహంబయ్యెనని క్రోధించి కాళిందీతీరమున నొకమునివరుని యజ్ఞరక్షణ సేయుచుండిన నీపుత్రునియమకింకరునింబోలఁబట్టి నేలంగవపిచంపెనుగదా.

అనుబంధము 24.

శత్రు:— తాపసోత్తమా! ఇదివ్యసనోదంతంబైనను నామానసంబున కమితాహ్లాదకరంబయ్యె; పుత్రశబ్దంబువీనియందుగదా సఫలంబయ్యె; గోద్విజరక్షణకార్యంబునఁ బ్రాణంబువిడిచినవాఁడు గదా ధన్యుండు. అట్టిచావుకేవలమనుజమాత్రుఁడు కోరినను వచ్చునా?

కృత్రి:— నీదృఢమానసంబునకు నేమెచ్చితి. ఇదిజ్ఞానులమార్గంబు. రాజవరా! నీకోడలయిన మదాలసను పిలిపించెదవా; ఆపతివ్రతకొకవర్తమానంబు దెలుపనీసుతుఁడునను నియోగించెను.

శత్రు:— మంచిది. (మదాలసాయని పిలువ మదాలసవచ్చును.)

మదా:— (కృత్రిమమునికి నమస్కరింపఁబోవ వలదని యామునినివారించును.)

కృత్రి:— చ. అలివేణీనినుఁగన్న నెట్టికఠినుండైనన్మనంబందుని
శ్చలనంబొందయుఁబూనుగాదె! తెలుపజ్ఞాలన్గటానాదువా
ర్తలు! హా! హావిధియెంతపాతకియొ? నేరంబేమియున్లేదె? యిం
తలుగావంతలపాలు నేసెనెనినున్నల్లి; యయోయీభువిన్.

సేసిపోయితే; నాదుచెలువంబుగానలోఁ
గాంచినవెన్నెలకిరణియయ్యె

గీ. నిన్నువిడనాడ జలజాక్షి నిక్కముగను
నెమ్మనమునుండి నేఁటికిపమ్మెనాథ
నిన్నునట్టేటముంచితే నాదురమణ
నీకుఁగానట్టియీమేనునిలుపఁజాల.

హా శ్రీపతీ! జన్మాంతరమందైనను నావిభుసింగూడునటులఁజేయుము హా! నాథా నాథా ప్రాణనాథా!

కృత్రి:— నృపాలా! ఈ మానినివ్యసనంబునఁ బ్రాణంబులువిడిచెడిలాగున్నది. ఇచటనుండిపిలిచి కొనిపొమ్ము.

శత్రు:— మదాలసా! (అనిచేఁబట్టిపిలిచికొనిపోవుట)

కృత్రి:— నేవచ్చినపని సఫలంబయ్యెను. ఈమానినిమరణంబిఁక గడియలోనున్నది. ఇఁకనేఁబోయి యాకువలయాశ్వునిఁబంపెద. భార్యమరణంబువిన్నతోడన వాఁడునుబ్రాణంబులువిడుచు. అస్త్రశస్త్రప్రయోగంబు లేక భుజబలంబుఁజూపక వాదంబుజరుపక ధనవ్యయంబుఁజెందక యించుకేని నొవ్వక కార్యంబుసాధించిన నాబుద్ధిబలంబెంత కొనియాడినననదితక్కువేయని తలంచెద. అదిగోయాక్రందనధ్వని వినవచ్చెడిని. పోయెద.

(నిష్క్రమము.)

పంచమరంగము.

కువలయాశ్వుఁడు - చేవలుఁడు - నాగలుఁడు.

అనుబంధము 25.

కువల:— హా! అకటా! ఆసుగుణమణి నామరణోదంతంబువినిన యొకగడియకుమున్నే ప్రాణంబులు పరిత్యజించెనఁట. హా! యాక్రూరునిదెంతగట్టివడిన యుక్కుగుండియయో! లేకున్ననవని బద్దలైయుడలుఁ బడఁగెడవకుండునా? ఎంతటికృతఘ్నుఁడనో తెలియదు? బ్రతికియేసుఖంబులనుభవింపఁ బ్రాణంబులింతగాఁ గాపాడుచున్నాఁడనో తెలియదు. హా! పతివ్రతామణీ! మదాలసా!

సీ. ఏసతిపతిసేవలు నేపగింపకభక్తిఁ
గుడిచినసత్కీర్తిఁ దాఁబడసెజగతి?
ఏచెలితనపాదమేర్చియయోమయ
చణకంబునుడికించిఘనతగాంచె?
ఏసాధ్వికాలునిఁయేమెత్తెఁజవెన్నంటి
పతిదానమునుగొనివడసెకీర్తి?
ఏతన్వితనపతిహితమునుమదిఁగోరి
సూర్యునిగతిఁబాపిసుఖముగాంచె?

గీ. అట్టికులసతులనుబోలునట్టిసువతి
సుగుణవతిపోయెనిఁక నెట్టిసుఖముగల్గె
ననని దుఃఖంబులప్పునప్పునకుటనాకు
వలదు ప్రాణంబు నాకిఁక వలదు బ్రతుకు.

ఈ తుచ్ఛమయిన బ్రతుకిఁక వలదు. వలదు. ఎప్పటికైననొకదినంబు మరణంబు సిద్ధంబు. తాపత్రయంబునకన్జిక్కియో, జరాభారంబు చేఁగృంగియో, శోతలంబగి ప్రాణంబుఁబో యుటకంటెను మహత్వంబుజరిన మానినీమణిపై నా ప్రేమానురాగంబిట్టిదియని సుప్రసిద్ధి చెందునటుల మానితంబుగా నా చేత నే నేఁజచ్చుటయుత్తమంబని తోఁచెను. ఆటులనే సెద.

చ. అతివ త్యజించె దేహము మదర్థము; నే సును సంత్యజించెదన్
వెతల శరీరముఁ జక్కనెసి; (అనుచుః గరవాలంబెత్తి)
వేదురమైతి నమంబుగాదె? హా
గతి చెడి నేమి సేయుదు నుగాంతకు ప్రత్యుపకారమేను? మా
నితమగు కాంతదేహమిది; నీతిగనుంచెదఁ భోగరిక్తతన్.

( దేవల నాగలుఁ ప్రవేశము ).

అనుబంధము 25.

దేవః— సఖా! ఈ వ్యసనంబువలదని యెంతయొత్తి చెప్పిననువినక యేకదేశంబుఁగోరి చింతచేశరీరంబు దపింపఁజేసెద వేల. ఇతరులకునీవుబోధించుచుండిన వైరాగ్యగ్రంథంబునే మూలంబవైచితివి? ఋణానుబంధంబులు నీటిబుగ్గలవంటివిగావా! దేహంబను నామంబుతోడనబుట్టి రక్తమాంసాదులచేనంటంగట్టి పరస్పరసంబంధంబుట్టిపడనెలకొనిన యంగంబులు గొన్నియుపాధులచే దేహాభిమానంబువిడిచి దేహినివదలిపోవా? ఇదియోచింపవేల?

నాగః— నెచ్చెలీ! నీదుఃఖంబు నాకతివిచిత్రంబుగానున్నది. మదాలసమరణంబునకుఁగదా నీవుచింతించెదవు నేనొకటినడిగెదఁదెల్పుము. మరణము మదాలసయను నామంబునకా లేక యాయింతిశరీరంబునకా? లేక యాయింతియాత్మకా? వ్యవహారయోగ్యంబై సర్వజనసామాన్యంబైన నామంబునకుఁ జావేమి? బ్రతుకేమి? పంచభూతాత్మకమైన శరీరంబుతత్తన్మాత్రలు గలయుననునది శతస్సిద్ధంబుగాన దానికిన్మరణంబు లేదుగదా? ఆత్మయంటిమో యదివ్యక్త్యాతీతంబుగాన నశ్యంబెన్నటికింగాదు. కుంభకారుండు కుంభినింద్రవ్వి మంటినిసేకరించి కులాలచక్రంబునఁ గుండలుగావించును. కొన్నిదినంబులకవి కుంభకారుని సంబంధమువదల్చికొని వెలఁగొనువాని వశమైవానిచే ననుభవింపంబడి తుదకుమాతృస్థానమగు పృథ్విలోలియ్యమగు. అటులనే దేహసంబంధములు.

దేవః— ఒకతూరిభాండంబులు గల్పించితినని మేసారికుంభకారుఁడు గుండలు చేయుటమానడు. దానిననుభవించి నష్టంబైనతోడన వేఱొకభాండంబు సేకరించియనుభవించుట వెలఁగొనినవాఁడుమానఁడు.



# మదాలసా నాటకము.

తురీయాంకము - ప్రథమరంగము.

అశ్వతరుఁడు - దేవలుఁడు - నాగలుఁడు - (పాతాళలోకము)

అశ్వ:— పుత్రులారా! కొన్నిదినంబులు గామీరు గృహంబుననుండక, ప్రొద్దైనరాకయే లోకంబునకుఁ బోయెదరు? అచటసత్కాలక్షేపంబు సేయ సుహృత్స్వరుశేరయిన లభించిరా?

దేవ:— జనకా! భవద్వాక్యంబ మోఘంబులు గావా?

నాగ:—మ. జనకా! భూతలమందునుండు నిఖిలక్ష్మాజాని యొక్కండుభూ
రినయప్రాభవుఁడాత్మవేత్త చిరకీర్తివ్యాప్తదిగ్జాలుఁడా
తనికిన్నేమగనుండు చారుసుగుణోదారుండు పుత్రుండుయౌ
వనవంతుండు ఋతుధ్వజుండు;

దేవ:— సఖుండై వాఁడుండు మాకాభువిన్.

నాగ:— తండ్రీ! ఆచక్రవర్తి పేరు శత్రుజిత్తు. సకలరాజన్యమస్తకాంచిత కోటీరమౌక్తిక స్తబకకందళిత కాంతిసంతానకవచిత పాదారవిందుండతఁడుగాన నేశత్రుజిన్నామంబు వానియందుసార్థకత నొందె. చందనంబునం బరిమళంబట్లు వానికన్న వానిపుత్రుండధిక గుణశాలి.

దేవ:—గీ. వానిగుణములు వొగడవాగ్జానికైనఁ
దరమె? సుగుణనిధానుండు దాల్మికల్మి
యరులపాలిటి మృత్యువుగురుకళాఢ్యుఁ
డార్తజనతావనుం డురుకీర్తిపరుఁడు.

తండ్రీ! ఇట్టిసుగుణఖని భూలోకంబున మాకుసుహృద్వరుండై యున్నవాఁడు. వానివియోగంబు మాకు దవానలయోగంబుగానుండు.

నాగ:—గీ. వానిఁగూడిన వనమైనభవనమగును
వాఁడులేకున్న భవనము వనముమాకు
తాత! పాతాళలోకంబు దాపమొసఁగు
భువినిభోగంబు లమరినట్లవునిజమ్ము.

అశ్వ:— పుత్రులారా! మీసఖునిగుణంబులు మనంబునకెంతేహర్షంబొసంగె. అహా! వానినిఁగన్నతండ్రిదిగదా పుణ్యంబు.

మ. సరివా రెవ్వని సాధుచర్యలుపరోక్షంబందుఁ బేర్కొందురా
పురుషుం డేగదజన్మ సార్థకతఁ బెంపొందున్ యశఃపూర్ణుఁడై?
ధరవానిన్గలినట్టి తండ్రిదియగాదా పుణ్యసంపత్తి? మే
దురమౌపూర్వతపఃఫలంబుగన పుత్రుండట్టి ఁగాంచుటల్ ?

పుత్రులారా! అట్టివానిం జెలిగాఁగన్న మీభాగ్యం బెంతటిదో తెలియకున్నది. ఇట్టివాని చెలిమి ధనంబిచ్చియైనం గొనఁదగినది.

క. ఇలసుగుణుల చెలికారము
వెలకున్నైనవలయునట్టి వెలనిడిదైనన్
ఖలమైత్రి వదలఁగావలెఁ
గలకాలమునరుఁడు సుఖముగాంక్షించినచోన్.

క. ఖలమైత్రికుక్కగోఁడుగు
న్వలెఁబుట్టునట్టుఁగాని వర్ధిలదు; మహా
త్ములసఖ్యమువటబీజము
వలెదినమున్వృద్ధిగాంచి ప్రబలునుజగతిన్.

సఖులనునామంబునఁ బెక్కండ్రుంటకన్న నిట్టివాఁడొక్కఁడు సాలఁడే?

గీ. కన్నవానిఁజెలిమి కాఁడనియెన్నఁడు
వానికొక్క సఖుఁడుగానిలేఁడు
కనఁగవలెనుగుణముఁ గనివెట్టిఁగావలె
వానిఁగూడిపిదప వదలఁదగదు.

నాగ:— తండ్రీ! ప్రపంచంబున నొకఁడునిజముగ సఖుఁడనికనిపెట్టుటకు మార్గంబెద్ది?

అశ్వ:—క. చెలికానికి నొకకష్టము
గలిగిననదితనకు నైనకష్టంబనివ
ర్తిలినట్టివాఁడెపో చెలి
నిలువెల్లనుదోఁచువాఁడు నెయ్యుఁడెజగతిన్.

దేవ:— తండ్రీ! ఆఋతుధ్వజుండు సఖ్యంబునకన్ని విషయంబులఁదగినవాఁడు.

అశ్వ:—పుత్రులారా!

క. ఘనుఁడగుమీ నెచ్చెలిని
న్మనభవనంబునకుఁదెచ్చి మానితముగభూ
షణవస్త్రాదు లొసంగుచు
మనినఁగదామీదు చెలిమిమహిమకు నెక్కున్.

దేవ:— జనకా! మణిభూషణాదులు వానికేమికొఱంత. శ్రేష్ఠతమంబులై యమూల్యంబులై యతికష్ట ప్రయత్నమున నొక్కటొక్కటి సేకరింపఁబడినమనయింటనున్న యాభరణంబులు సంఖ్యాతీతంబులై వానియింటనున్నవి. కుబేరునధిఃకరించునంతటి యైశ్వర్యంబున్నది. హా! హా! ఏమియుండిననేమి? నాసఖునకుంజేతో మోదంబు లేక భోగవరాఙ్ముఖుఁడై యున్నవాఁడు.

నాగ:— దేవలా! ఆవ్యసనహోదంతంబేల స్మరణకుఁదెచ్చెదవు? వినహోపఁజాల.

దేవ:— నాగలా! స్మరణకుఁదెచ్చుటేమి? మఱచినవారెవరు? అతితరుణాటవమునంబలి యనలంబు మాడ్కి హృదయంబేర్చుచున్నదియే.

అశ్వ:— పుత్రులారా! త్వత్త్పహోదఁడై మీసఖుఁడుఁవంతుఁబొఁ గారణంబేమి! తత్కారణపరిహారంబు మీకొనర్పంజాలరైతిరా?

దేవ:— అదిచక్కఁబెట్టుటకు మీఱినపని; అశక్యంబు.

అశ్వ:— పుత్రులారా! ప్రయత్నంబునకు ఫలింపనిపనియొకటి యీప్రపంచంబునఁగలదా? "యత్నేన కర్మాణిఫలంతిలోకే" యనియెడియార్యనీతి లేదా? అసాధ్యవిషయంబు పృథుసాహసంబున ఫలింపంజేసిన దృష్టాంతములు లేవా?

సీ. మహితయత్నంబున నహుషుఁడు దేవేంద్ర
పదవినిందాడఁడె యాలోచింపఁగనఁడె
సాహసంబున వియద్ఝరిని భగీరథుం
డవనికేతెంపఁడే యచ్చెరువుగ
పట్టుగాఁబ్రహ్మర్షి పదవినిఁదాఁగోరి
సాధింపఁడాయె నేగాధిజుండు
వనచరులెల్లరు వనధిబంధింపరే
విపులసాహస వృత్తి వెల్లివిరియ

గీ. చలనరహితంబునగునట్టి సాహసమున
దుర్లభంబైనకార్యంబు దొరకదెచట
గానవ్యవసాయమే ముఖ్యకారణంబు
సెట్టిపనికిని; మీరిది యెఱుఁగవలదె.

పుత్రులారా! ప్రయత్నంబుసేయుటమనపని. దానిఫలింపంజేయుటదైవంబుపని ప్రయత్నంబు సేయక ఫలంబుగోరుట పిచ్చివారిపని. ఎకార్యంబు నసాధ్యంబనుచుండుట మాంద్యులపని. కావునమీనెచ్చెలికిం గలిగిన దుఃఖకారణంబుఁదెలిపినఁ దత్పరిహారప్రయత్నంబు సేయనగు.

దేవ:—క. నాతరమా నే తెలుపఁగఁ
దాతా! తలఁచినను జాల తాపమొనర్చున్

నాగ:— ధాతకు నెంతటి తెలివియొ
నాతినినటుబాపఁదగు నెనయు మేదికటా.

అశ్వ:— పుత్రులారా! ఆరాకమారుని దుఃఖంబునకుఁగల కారణంబు దెలుపుమనిన మీరేమఃఖపడు మన్నారు. ఎల్లపుడువ్యసనపడుచుండుట పురుషధర్మంబుగాదు.

అ ను బ ం ధ ము 28.

మ. కలదేయేఫలమైన నిట్టిపనటం గార్యంబుసేయఁగా నే
కలఁగన్నాఁజెడెబుద్ధి? శక్తిచెడదే? కాన్పించునే ధైర్యముల్?
చలనంబొందదెలక్ష్మి? యీకతననుత్సాహంబు, దా, డిందదే?
వలవంతన్గను టెంత చేటునకునావాసంబో యూహింపుఁడీ.

దేవ:— తండ్రీయటులైనఁ జెప్పెదవినుము. గాలవమునియాగరక్షణార్థంబు మత్స్యఖుఁడుపోయియుండఁ బాతాళకేతుండను దానవుండు శత్రుక్రతుధ్వంసంబునకురా వానివెనువెంటనంటిన వాఁడొక బిలంబుసొచ్చెనఁట ఋతుధ్వజుండును దద్బిలంబుసొచ్చి యాక్రవ్యాదుని ద్రొవ్వణఁచిచంపి పరిసరంబున భాసిల్లుచుండిన యదృష్టశ్రుతపూర్వంబగు నొకపట్టణంబుగని యాపురవరంబున మేల్తరంబైయుండు మందిరంబొకటిసొచ్చి యందొకమందయాననుఁజూచి దానిసౌందర్య సౌశీల్యాదులుమెచ్చి దానివరించి వివాహంబాడి దానింగూడికొయింబవలు విహరించుచుండె నఁట దానినామంబు మదాలస.

అశ్వ:— ఏమీ! మదాలస. మదాలస. విశ్వావసుండను గంధర్వరాజునకు మదాలసయను కూఁతురుం డెను. ఆరాజునాకత్యంత ప్రేమాస్పదుఁడు సఖుఁడు.

నాగ:— ఆరాజుకూఁతురే యీ మదాలస.

అశ్వ:— దేవలా! పిమ్మటవృత్తాంతంబు దెలుపుము. జాగుసేయకుము.

దేవ:— పిమ్మటదుష్టదానవపీడితులగు సాధుజనులరక్షింపఁ గువలయంబనువరతురంగంబునెక్కి దినదిన మొకతూరి భూవలయంబుదిరిగివచ్చుచుండిన మత్స్యఖునికువలయాశ్వుని తాళకేతుండను క్రూరదానవుఁడుగని భ్రాతృమరణఖేదక్రోధుండై కుహనామునివేషంబున వానిగ్రైవేయ కంబు యాగదక్షిణార్థంబర్థించి గ్రహించివారుణ జపవ్యపదేశంబున మత్స్యఖునిపర్ణశాలఁ గాచనుంచి కితవహిత వృత్తిచే మదాలససరసంజేరి తాళకేతుండను దానవునిచే నీపతి మరణంబునొందె. నీ హారమ్మునీకిమ్మనియొనవిశ్వాసంబుగావచింపనాపలుకు వెంబడిన యాపతివ్రత పంచతనొందెనఁట.

అశ్వ:— అకటకటా! వినఁగర్ణకఠోరంబుగానున్నదే? ఎంతటిక్రూరుఁడు వాఁడు.

నాగ:— జనకా! మత్స్యఖుఁడు కువలయాశ్వుండు పిమ్మటపురిఁజేరి భార్యామరణంబువిని దుఃఖాతిరే కంబున వేదియుఁదోఁపక జీవచ్ఛవంబై సకలభోగంబులు త్యజించియున్నవాఁడు.

అశ్వ:— అట్టిసుగుణవతి సతిపోయినంబతిగతియదియేగదా. పుత్రులారా! వేఱొకవివాహంబు మీరుపదేశింపకైతిరా?

దేవ:— మదాలసతప్పతదితరులు తనశారీరసుఖభాగరులుగాదని పట్టుపట్టినాఁడు. ఏమిసేయుదము. ఈపని యొందునదీరును. తీరకున్నమాసఖుండు బ్రతుకుతెరవెద్ది? అతెరవుగానకున్న మా

ప్రాణంబు లెటునిలుచు. నిలువకున్న వృద్ధాప్యదశలో నీపుత్రశోకంబు సహింతునే!
అయ్యో!

అశ్వ:— పుత్రులారా! చింతింపకుఁడి. సర్వత్రయ [illegible] ఈశ్వరుండు సహాయుఁడైయుండు. చచ్చినస్వర్గంబునందున్న మదాలసనుసీలోకం [illegible] చెప్పి నాబిడ్డగాఁ బెంచి యౌవనయౌవ్వని నాయిల్లాలిగాఁ జేసుకొనియెద. మంచిది. ఇప్రుడు వెళ్లుదమురండు.

(నిష్క్రమణము.)

## ద్వితీయరంగము

హిమాలయపర్వతము

అశ్వతరుఁడు - పార్వతీపరమేశ్వరులు.

(అశ్వతరుఁడుగ్రతపంబు సేయుచుండఁ గూర్చునియుండుట.)

పార్వతీపరమేశ్వరుల ప్రవేశము.

అనుబంధము 29.

పరమే:— అర్థాంగీ! ఈభూరుహంబులను తమలగల్గు ఫలంబులను గంటివే?

క. నగజాతాయిదిచోద్యము
నగములభేదించునిచటినగజాతము; ప
న్నగజాతివైరిఁగనఁగా
నగుచుండుసునాగజాతినాతిగంటే.

పార్వ:—క. నగచాపానినుఁగూడిన
నగజాతకుఁగల్గదేమినగభేదత; ప
న్నగహారునిఁగన్నులఁగని
నగుఁగాదేనాగజాతి నాథావినవే.

పరమే:— అచలాత్మజా! ఈచపలావలోకన లుయ్యేలలూఁగువై భవంబున నిభుభాలయంబు చరణంబులచే నంటిరికంటివే.

క. ప్రాలేయాచలకన్యా
యాలేఖర్షభపురంబునంటిరిగంటే
బాలలువల్లిడోలా
లీలాఖేలనవిలాసలీనహృదయులై.

పార్వ:— నాథా! ఇటుగంటివే! ఇచట వనచరులచర్యలు.

క. మనిసిజవైరిగంటివె
ఘనతరులంగూడిప్రొద్దుఁగడపుచు, గుహాలం

జనినిద్రించుచు ఫలములఁ
దినిమును మునివరులఁబోలు నస్మద్వనచరులన్.

పరమే:— పంచాస్యమధ్యా! పంచాగ్నిమధ్యస్థితుఁడై తపంబు సేయు నీప్రాణినిఁ జూచితివా.

క. నారీమణి యిటు గనుమా
యీ శాసనమును ధరించి వీరాగ్రణియో
గాభ్యాసమానసుండై యు
ఘోరాతిశయంబుగను దపముఁ బూనిక్రశించెన్.

పార్వ:— నాథా! కోరినవారికి వారిగ వరంబు లిచ్చువాఁడవు నీవనిగదా సమస్తభూతకోటి నిన్ను బ్రార్థించుచున్నది. వీఁడున్నూరేండ్లు తపంబు సేయుచున్నవాఁడు. వానికోరిక సఫలంబు సేయ నాలస్యం బేల?

పరమే:— రమణీ! వీఁడశ్వతరుండను నాగరాజు వీఁడొకయసాధ్యంబగుపని సాధింపఁబూనినవాఁడు.

పార్వ:— నాథా! వానికిని సాధ్యంబుగాకున్న. నీకోటి యొసఁగ సమర్థుఁడవైన ప్రభునకది యసాధ్యంబా! అటులైనఁ బరమేశ్వరుండను పేరుపోయి ప్రపంచమునఁ గించుగదా!

పరమే:— గిరితనయా! నాకున సాధ్యం బెద్దియుఁగలదా! మంచిది. వీనికిఁ బ్రత్యక్షంబై వరంబిచ్చెద.
వత్సా! అశ్వతరా! లెమ్ము! ఇంతటియుగ్రతపం బేల సేయుఁదొడంగితివి ?
(అశ్వతరుండు లేచి సాష్టాంగనమస్కారంబు లాచరించి).

అశ్వ:—క. మునిమానసహంసా హేసే
మది నేనుతింతు నీమహామహిమలహో
ప్రణవంబున సాక్షాత్కంబై
వినుతింపఁగ స్థాణువయ్యు వెలయుదు జగతిన్.

సీ. అంధకాసురుఁడు గర్వాంధుఁడై జగమేఁప
భైరవాకారుఁడౌ భర్గుఁడీవ
వరగర్వమునఁ జేసి సురలనేఁచినగజా
సురునిఁ గూల్చిన శుభంకరుఁడవీవ
ఘనశక్తిగలచక్రమును సృజించిజలంధ
రునిరూపుమాపిన మునివినీవ
నిర్వీర్యులయినట్టి నిర్జరులను బ్రోవ
శక్తిఁబుట్టించిన శంభుఁడీవ

గీ. కౌశికునిఁగట్టికొనిపోవ్రు కాలయముని
బట్టిపడఁగొట్టి నెట్టినదిట్టవీవ
సర్వజగములు సృజియించు స్రష్టవీవ
కడఁగి జనులను రక్షించుకర్తవీవ.

మహాదేవా! ఇట్టిమహిమలుగల నిన్ను నేనెంతనుతించిన నదియంభోనిధిలో నావగింజమాత్ర యుండును. నక్షత్రములలెక్కఁబెట్టినవాని విధంబగు.

పరమే:— వత్సా! నీనయవినయభక్తులకు నేమెచ్చితి. ఏయర్థంబుగోరి నను బ్రార్థించితివో తెలియఁ జేయుము.

అశ్వ:— అంధకరిపూ! నావృత్తాంతంబు దెలిపెదను.

మ. వినుమా దేవ; ఋతుధ్వజుండను మహావీరుండు; దానైకజీ
వనుఁడయ్యో కపటాత్ముచే వనితజీవంబున్ విడెన్! హా ప్రియా
యనుచున్ రావె మదాలసా యనుచు, హాహాభామినీ యేలరా
వని దైన్యోక్తులు నాడుచుండును వియోగాంభోనిధి న్మగ్నుఁడై.

దేవా! ఆరాజకుమారుఁడు భార్యావియోగంబుచే భోగంబులన్నియుఁ ద్యజించి చింతచేఁ గృశించుచున్నవాఁడని మత్సుతులచే వింటిని.

గీ. వానివ్యసనంబు వినితపంబూని తేను
దేవ యీవమదాలసా దేవినాకు
సుతగను వయస్కురాలుగ సుగుణవతిగ
మరణమునకన్న మున్నున్న మురువులొప్ప.

శంభో! ఇదియే నాకోరిక! మఱేదియు నాకు వలదు.

పరమే:— (పార్వతిదిక్కుఁజూచి)

పర్వతనందనా! కంటివే యీపరోపకారబుద్ధి; గౌరవంబు సెడి కడు దీనులై శరణని వేఁడినఁగాని యర్థులయిష్టార్థంబు నెరవేర్చువారినిఁ గనుటకష్టంబు. అటుగాక యొకఁడు వ్యసనంబునన్నవాఁడని వినినంతమాత్రన దత్పరిహారంబునకుఁ బ్రాణాంతకంబైన తపంబు సేయం దొడంగె.

అనుబంధము 30.

సీ. విబుధారులనుజంపు విధముగానక యెమ్మె
దీనత వేఁడ దధీచియిచ్చె
పొడవడఁగుచుఁ జిన్నిపడుగయి వామనుం
డడిగిన బలియిచ్చె నవనితలము
పదములఁబడుచు మాంపాహియంచని
వేఁడ పిచ్చుక యెత్తైరనిచ్చెనొకఁడు
కామించియడిగినఁగాని తానియ్యదు
కామధేనువు గోరుకాంక్షితముల

గీ. ఎవఁడో నాఁచటనో యుంటినైన యేడ్చుచున్న
వాఁడనుచుఘోరశాపమూని నాఁడె వీఁడు
యువిద కంటికి ఁయిట్టిపరోపకార
బుద్ధినొక్కనిపడు నాగ్యభూషణములను.

(అశ్వతరుదిక్కుఁజూచి)

వత్సా! నీయభీష్టంబు నెరవేర్చెద. వచ్చెడిపౌర్ణమా శుక్రవారంబునందా సుందరాంగి నీమందిరంబుననుండు. ఇఁకనీవుపురంబునకుఁబొమ్ము.

అశ్వ:— (వందనంబొనరించి వెళ్ళిపోవుట.)

(నిష్క్రమణము.)

తృతీయరంగము.

మదాలస - అశ్వతరుఁడు

మదాలస:- (స్వగతము.)

ఉ. హా జగదేకమోహనశ్రీతోవన పావనసాధుజీవనా
యేజమునఁ దాఁకినిల్చినిసునా గ్చైనె; యోర్చెనె నీదుబాణముల్
నీజవసత్వసంపదలు నిన్నెడఁబాసెనె నీవెన్నఁగితే
రాజకుమార నీవెట్టుల రాక్షసుబారికిఁజిక్కితక్కటా.

హా హా! ప్రాణనాథా! పాపమయుఁడగు నీజగంబుననుండుట నీబోటిపుణ్యునకుఁదగదని దనుజమిషంబున జీవంబుఁబాసితివే? నన్నిటు దుఃఖవారిధింబడఁద్రోసి నీవుదరి జేరితివే? ఎంతటినిర్భాగ్యురాలను నేను.

ఉ. ప్రాణముఁబాసెభర్తయనుపాతకహేతుకఘోరవాక్యముల్
వీనులఁబడ్డమాత్రమునవ్రీలకనాహృదయంబునిల్చెఁగా
మానితపూనెదేహమిఁకమానకమోర్ద్వడుప్రాణమున్కైవడిన్
బూనిచరించుటల్? జనులుభూతముభంగినినన్నుఁజూడరే.

ఈహృదయంబభేద్యంబగు శిలయనిపోఁచెదను. ఈప్రాణంబు మానితంబుగఁ దాపై దేహంబు విడవదయ్యె! ఇఁకనాసాహసంబున నీదేహంబువిడిచెద. ప్రాణంబెటునిలుచునో చూచెద (అనుచులేచి నలుదిక్కులఁజూచి యాలోచనాధీనచేతస్కురాలై)

ఉ. కాదుమదీయమందిరము; గాదిదిమన్నగరంబు; గాదు కా
దీదడిమంబువింతలివియిచ్చట కేవిధమేనువచ్చితిన్
నాదయితుండువోయెనని నాఁడట మౌనివరుండువల్కనే
నాదవహించిచింతిలితినక్కట; యిక్కడకేరుదెచ్చిరో.

హా! నాయుదంతంబు ప్రపంచంబునకేవింతయయ్యె! గంధర్వరాజునకుఁ ముద్దులకూఁతురై బంధుజనవ్రాతంబుగారవంబునఁ జూచుచుండఁబాతాళి క్రూరదానవుని బారింబడితి. కొన్నిదినం

ఖులకుదీనజనబంధువుండగు రాజకుమారునిఁగూడి సుఖంబుననుండితి. తుదకుం బ్రాణప్రియునిఁ గోల్పోయి యెటులనో యీమందిరంబుఁజేరితి. వాదియెట్టిపరిహాసాస్పదమగు బ్రతుకయ్యె? ఛీ ఛీ యీప్రాణంబుండఁదగునా.

ఉ. పిన్నతనానఁబ్రీతిగను, బెంచిననాతలిదండ్రులక్కటా
ఖిన్నతనొందియేమయిరొ; కీర్తిపరుండుమదీయభర్తయా
పన్నశరణ్యుఁడాదనుజుపాల్పడిపోయెను దిక్కులేదయో
పన్నగభూషణా; యిటులఁబ్రాణమునన్నునిల్పుటొప్పునే.

(అనుచు నేలపైఁ వ్రాలును.)

( అశ్వతరుండు ప్రక్కనుండి యంతయు విని. )

అశ్వ:— (స్వగతము) ఈమానినీమణి యారాజకొమారునిఁ దలఁచికొని దుఃఖంబుబట్టఁజాలక నేలపై వ్రాలె. ఈసుదతిని నేఁడు దేర్చుట యిపుడు కర్తవ్యాంశంబు. ఆరాజకుమారుని మనంబు దెలియు నంతవఱకు వాస్తవంబీసతికి నెఱుకపఱచుటయనర్థంబు. అనృతంబాడుటదోషంబు. అనృత దోషంబురానటుల వాస్తవ్యంబు వెలివడకుండనటుల మాటలాడి దుఃఖోపశమనంబు సేయఁ జూచెద. కువలయాశ్వునిఁ బిలువఁబోయిన మత్సుతులింతలోవత్తురు.

మదా:— (లేచి అశ్వతరుంజూచి) తండ్రీ! నీవెవరు?

అశ్వ:— ప్రియనందనా! ఈపాతాళంబు నేలురాజును. నాపేరశ్వతరుండందురు. నీతండ్రివిశ్వావసుండు నాకత్యంతప్రియసఖుఁడు.

మదా:— మహానుభావా! నీపేరు నాతండ్రి చెప్ప న్వినియుంటి. తండ్రీ! నేనిటకెటువచ్చితి? ఎవరు దెచ్చిరి.

అశ్వ:— నందనా! వివరంబుదెలుప సమయంబుగాదు. వ్యసనవారిధిలో మునింగిపోయిననిను నాయోగమహిమచే నిటకరప్పించితి.

మదా:— కారణంబేమి?

అశ్వ:— దుఃఖోపశమనంబునకు

మదా:— తండ్రీ! నాదుఃఖాగ్ని యీజన్మంబునఁ జల్లారదు.

అశ్వ:— తల్లీ! దైవంబునుభజించు చుండుము. ఈజన్మంబుననే నీదుఃఖంబునకుఁ దుదిఁగలుగు.

(భటుఁడొకఁడు ప్రవేశించి)

భటుఁడు:—మహానుభావా! నీసుతులు నీకుఁగాను మందిరాభ్యంతరంబునఁ గాచియున్నవారు.

అశ్వ:— హా! హా! వారువచ్చినవారా! (మదాలసదిక్కుంజూచి) మదాలసా! నీవీరీతి దుఃఖపడుచునుండకుము. వ్యసనంబునం బ్రయోజనములేదు. సుఖంబుగలుగుననిరొండి యుత్సాహంబుననుండుము. చేరువనేయుపవనంబున్నది. వలయుననచటికిఁబోనగు. నాకుఁగాను నాపుత్రులు గాచియున్నవారు. పోయివచ్చెద (అనుచు వెళ్ళిపోవును.)

మదా:— (స్వగతము) ఈయశ్వతరునిఁజూచినపుడె నామనంబున నుండు చింతాగ్నియించుక చల్లారె. కారణమేముండును? ఇతనిమాటలుగూఢార్థములచే భాసిల్లుచున్నవి. యోగమహిమచే నన్నింటకు రప్పించెనఁట. అదిదుఃఖోపశమనంబునకఁట. ఈజన్మంబుననే నాదుఃఖాగ్ని చల్లారునఁట. సుఖంబుగలిగెడి ననుసంతసంబున నుండవలెనఁట. సమయంబుగాదని వివరంబుఁ జెలుపఁడఁట. ఈమాటలకర్థంబేమో తెలియకున్నది. నేనిచటటికి వచ్చుటయు నీఘనునిమాటలుఁజూడ నింద్రజాలంబై దోఁచుచున్నది. అయిననీఘనుని ముఖవర్చస్సుగనఁ దపోమహిమగలవాఁడని దోఁచెను. మంచిది కొన్నిదినంబులుగాచి, నేనిప్పుడు నేయంబూనిన సాహసంబుపును నేనెద. ఇచటఁ జేరువనే వనంబున్నదఁట పోయియీక్షించెద.

(నిష్క్రమము.)

## తురీయరంగము.

### నాగరాజుమందిరము - కువలయాశ్వుఁడు.

కువల:— (స్వగతము)

ఈయశ్వతరుండు నాకుంజేయుసత్కారం బపరిమితంబుగానున్నది. అమ్మహాత్ముని యెదుట నుండి యతనిహితనీతులువినుతఱి నాదుఃఖబంతయు నంతంబగునట్లగపడెను. అతనిపుత్రులగు మత్సఖుల యుపచారంబులకు సిగ్గయ్యెడు. మదీయేప్సితంబేమయిననుండిన నిచ్చెదఁగోరుమని యీనాగరాజు దినదినమునన్నడుగుచున్నవాఁడు. నేఁగోరునదేమియున్నది. సర్వైశ్వర్యంబు లార్జించి సకలనరపాలకులప్రదీపకుఁడై సముద్రముద్రిత భూతలంబు మజ్జనకుండేలుచున్నవాఁడు. స్త్రీసుఖంబన్ననో మదాలసేతరతరుణీ సుఖంబు నేఁ ద్యజించితి. ఇఁకనాకేమి గావలయును? ఏమియువలదు. ఈతపోధనునిసన్నిధాన మహిమంబున మదీయహృదయాంతరిత వియోగదుఃఖానలంబించుక చల్లారుచున్నయది. అది తాత్కాలికోపశమనంబైనను, నాకపుడెంతో హితంబుగానుండును. కాననేయుఁకఁగొన్నిదినంబు లిచటనుండ సమ్మతించితి. నాసఖులు నేఁడేమో పనిమీదనున్నట్లు దోఁచెను. ఉపవనంబునకుఁబోయి ప్రొద్దుపుచ్చుకొనియెద.

అనుబంధము 31.

(నిష్క్రమము).

శ్రీ

# మదాలసనాటకము

## పంచమాంకము - ప్రథమరంగము.

### అశ్వతరుని యుపవనము.

మదాలస — కువలయాశ్వుఁడు.

మదాలస కువలయాశ్వుఁడు వేఱువేఱు ప్రదేశంబులం దుపవనంబుననుండుట.

మదా:— (స్వగతము). తల్లీకుండలా! హా! హా! వలదనియెన్నివిధంబుల నేవేఁడికొన్నను త్వరలోమరలవచ్చెదనని తీర్థయాత్రాభిలాషిణివై వెడలియెన్నిదినంబులైనను రాకనిలిచితివిగదా! దురంత కష్టంబున నాతల్లిమాఱుగాననుఁబెంచిన నీవునాసరసనుండిన నాకింతటిదురవస్థవచ్చునా? దైవయోగంబునవచ్చి ప్రాణంబీరీతిమొండివడినిలిచినను నీహితనీతివచనంబులు నన్నించుకయూఱడించుచుండెనుగదా.

మ. తరుణీకుండలనాఁడు రాక్షసునిచేతన్జిక్కి మూర్ఛిల్లి; సా
దరతన్నీదుహితోక్తిమారుతముగాదా సేదదేర్చె; న్భవ
త్కరుణాలాపముఁజేసిగాదె బ్రతుకంగానోర్చితి; న్ధారుణీ
వరసూనున్పతిగా వరించితిని నీభాగ్యంబునన్దల్లిరో.

తల్లీ! పలలాశికిజిక్కి పటుతరదుఃఖ పారావారంబున మునింగిపోవుతఱి ప్లవంబుమాడ్కిఁ గణనాతీతసంతోష తీరంబునకు నన్నుఁజేర్చినగుణమణివి నీవుగదా; నీవేలనాకిపుడగపడకున్నావు కుండలా జననీ!

అనుబంధము ౩౨.

మ. జననీభర్తృవియోగవహ్ని తనువృక్షంబెల్ల వ్యాపించి మె
ల్లనఁగాల్పన్దొడఁగె న్సహింపనిఁక; నేలా రావునన్బ్రోవఁబా
వనమౌనీదుదయారసంబుసుతపై వర్షింపవేమమ్మ; జీ
వనమయ్యోచెడి దేహకాష్ఠమిటు నిల్పన్జాలనమ్మా భువిన్.

కువల:— అనుబంధము ౩౩.

(స్వగతము) ఏమీ నాప్రాణప్రియ మదాలసధ్వనిబలె వినఁబడుచున్నది. ఇంకెచటిమదాలస; నాకేలయీయడియాస; నాఁటికేపరలోకవాసినియయ్యె. ఒకరిధ్వనిఁబోలి మఱియొకరిధ్వని

యుండవచ్చునుగదా? కుండలయొనర్చిన యుపకారంబులు దలంచికొని యేడ్చుచున్నదియో? కుటిరయొకకుండల వేఱొక యువతికి నట్టియుపకారంబు సేసియుండఁగూడదా? ఏమీ! కంఠరవము. కలసినచెలి చేసినకార్యము. ఇవియన్నియు నొక్కవిధంబుగానుండునా? అటుగా కున్నఁబరలోకంబుసేరిన మదాలసబ్రతికివచ్చునని తలంచుటకుమార్గంబెద్ది? భ్రమచేసిట్టివిచిత్రములు దటస్థించునని లోకరూఢియున్నదిగదా.

ఉ. ప్రాణపదంబు గాఁగ నెడువస్తువుపో భ్రమజెందిదీనతన్
దానినెమానవుం డెపుడుదప్పక చిత్తమునందలంచుచున్
హానముఁబాసిపోయె నకటాయని వెఱ్ఱియుఁబోలె బ్రేలఁగాఁ
గానఁగవచ్చినట్టులవుగాని నిజంబుగఁగానవచ్చునే.

మనోభ్రమచే నీధ్వనినాకువినఁబడినది గాని నిజమగు మదాలసాధ్వని యెటులగు? హా! అంతటి పుణ్యంబు నిర్భాగ్యునకు నాకేలగలుగు?

మదా:— (స్వగతము) ఏమియిది? నాప్రాణప్రియుని కంఠరవంబుబలె వినఁబడెడు. పరలోకంబునఁ బరమసుఖంబునను్నపతి నాబోటినిర్భాగ్యురాలికి దక్కునా? ఏలయీలేనియాశ? హా! మదాలసాయనినన్నుఁదలంచి దుఃఖించుచున్నవాఁడే; అయ్యో! పరలోకంబుననున్నను నాపైఁ బ్రేమమఱవఁడాయెఁగా? హానాథా! నాగతియీరీతివ్యర్థముసేసితివే? ప్రాణపతీ!

సీ. పతిలేనిజన్మంబుపడఁతికివ్యర్థంబు
జలమింకిపోయినకొలనురీతి
కాంతునిఁగూడనికాంతజీవనమిలఁ
గోవెలకూడనిమావిగాదె
మణిగణాభరణముల్ ధనమియ్యమఱివచ్చు
పోయినవరుఁడెటువుట్టివచ్చు
వైధవ్యమనువ్యాధివనితలుసైతురే
యున్నవారైనవారున్నవారె?

గీ. అకటకువలయాశ్వ యబలననాథను
నడవిపాలుసేసియతివసీవు
బ్రతుకువెతలబ్రతుకుక్షితిఁజిరాయువుగాఁగ
ననుచునన్నువిడిచియరిగితేర.

కువల:— (స్వగతము) ఏమి? "కువలయాశ్వ" యనినన్ను సంబోధించి పలికినట్టువినఁబడెను. భ్రమయింతటిదిగా నుండునా? వాక్యము శబ్దము అక్షరక్షరము వినఁబడుచున్నదే? భ్రమగాదిది నావ్యసనప్రలాపంబులు నాయిలువేల్పులువిని యీమదాలసమధురవాక్యంబులై ననువినిముదమొఁజెందనిమ్మనియెంచి యీమదవతిని వేఱొకశరీరంబునఁ బంపినారని తోఁచెడు. ధ్వనియీదిక్కునుండివచ్చినది. అటువోయియీసహజాలంకార దేహసౌందర్యముఁగల మంద

యానను వీక్షింతునా? స్త్రీలువిహరించు ప్రదేశంబది పురుషులుపోనగునా? వలదు వలదు. ప్రాణసతీ మదాలసా! కృత్రిమదానవుండు కుహనామునినై పలికినయవాస్తవంబులు విశ్వసించి ప్రాణంబులు విడిచితివే! గజగమనా! ఇదితగునా ?

మ. కరియానా! కపటాత్ముఁడాడినయలీకంబుల్ మదిన్నమ్మియా
తురతన్ దేహమువాయఁగాఁదగునటే? దోషంబుగాదే సఖీ?
యురుప్రేమన్నినుఁజూచువారెట్టులనీయూర్వీతలంబందు ని
ల్తురుప్రాణంబున? నింతనీవుమనమందున్గానఁగావల్దటే?

మదా:— (స్వగతము) ఏమివిచిత్రంబిది! నాయొద్దకువచ్చి నాప్రాణపతిదుర్గతిఁ దెలిపినవాఁడు కైతవమునియఁట. వానివచనంబులలీకంబులఁట. ఇదినిజముండునా! ఆహా నిజమైనచో నా సంతసంబునకుఁ గొఱంత లేదుగదా! నేమరణంబుఁజెందితినని పలుకుచున్నవాఁడే? ప్రత్యక్షముగఁ నేఁబ్రాణమునునుండ మరణంబుఁజెందితిననునది నిజంబునకుదూరంబుగదా! ఈ యశ్వతరుండు తనతపోమహిమచే నిట్టియపూర్వవిచిత్రంబులు గల్పించి నన్నాడించుచున్నవాఁడని నాకుందోఁచెడు. లేకున్న స్వర్గంబునందున్నప్రాణపతి యీలోకంబునకువచ్చి మాటలాడునా? ఇఁక నేలయీయాశ!

(మదాలసాయని దూరంబునుండిధ్వనివినుట)

ఎవరోపిలుచుచున్నవారు ప్రొద్దైనది పోయెద.

(మదాలస వెళ్ళిపోవుట)

కువల:— ఏమియిది మదాలసప్రత్యక్షంబుగఁ బ్రాణంబుననున్నదఁట. నేనేయవాస్తవంబులాడితినఁట; హా హా! మదాలసామరణంబు గన్నులారఁజూచి యగ్నిసంస్కారాదులు సేసిన నాతండ్రి యబద్ధములాడియుండునా ? లేక మజ్జనని యబద్ధము లాడియుండునా ? పురజనులాడియుందురా? వీరందఱుమోసపోయిరని యనికొందము; అటులయిన నామందిరంబుననున్న మదాలసయెటుపోయెను? అబద్ధములేలయగు? నిజము నిజము; నన్నాడించుటకై యీ యశ్వతరుండు పన్నినయింద్రజాలంబిది. లేనిచోఁబరలోకంబుననున్న పుణ్యవతి మాటలాడుటెటుల? ఏరూపంబుననోయున్న మదాలసమాట లించుకవింటినిగదా! ఆనంతసంబేచాలు ప్రొద్దాయెను. పోయెద.

అనుబంధము 34.

(నిష్క్రమము.)

ద్వితీయరంగము.

అశ్వతరునిమందిరము

అశ్వతరుఁడు - దేవలుఁడు - నాగలుఁడు - కువలయాశ్వుఁడు - మదాలస.

అశ్వ:— (కువలయాశ్వుని దిక్కుంజూచి.)

క. అసమానమానధన, యో
కుసుమాంబక రూపవిభవ, కుజనకుఠారా

యుండవచ్చునుగదా? కుండలయొనర్చిన యుపకారంబులు దలంచికొని యేడ్చుచున్నదియే? కుటిరెయొక కుండల వేఱొక యువతికి నట్టియుపకారంబు నేసియుండఁగూడదా? ఏమీ! కంఠరవము. కలసినచెలి చేసినకార్యము. ఇవియన్నియు నొక్కవిధంబుగానుండునా? అటుగాకున్నఁబరలోకంబు సేరిన మదాలసబ్రతికివచ్చునని తలంచుటకునూర్గంబెద్ది? భ్రమచేసిట్టివిచిత్రములు దటస్థించునని లోకరూఢియున్నదిగదా.

ఉ. ప్రాణపదంబు గాఁగ నెడువస్తువుపో బ్రమజెందిదీనతన్
దానినెమానసంబు డెపుడుదప్పక చిత్తమునందలంచుచున్
హాననుఁబాసిపోయె నకటాయని వెఱ్ఱియుఁబోలె బ్రేలఁగాఁ
గానఁగవచ్చినట్టులవుగాని నిజంబుగఁగానవచ్చునే.

మనోభ్రమచే నీధ్వని నాకువినఁబడినది గాని నిజముగ మదాలసాధ్వని యెటులగు? హా! అంతటి పుణ్యంబు నిర్భాగ్యునకు నాకేలగలుగు?

మదా:— (స్వగతము) ఏమియిది? నాప్రాణప్రియుని కంఠరవంబుబలె వినఁబడెను. పరలోకంబునఁ బరమసుఖంబుననున్నపతి నాబోటినిర్భాగ్యురాలికి దక్కునా? ఏలయీలేనియాశ? హా! మదాలసాయనినన్నుఁదలంచి దుఃఖించుచున్నవాఁడే; అయ్యో! పరలోకంబుననున్నను నాపైఁ బ్రేమమఱవఁడాయెఁగా? హానాథా! నాగతియీరీతివ్యర్థము సేసితివే? ప్రాణపతీ!

సీ. పతిలేనిజన్మంబుపడఁతికివ్యర్థంబు
జలమింకిపోయినకొలనురీతి
కాంతునిఁగూడనికాంతజీవనమిలఁ
గోవెలకూడనిమావిగాదె
మణిగణాభరణముల్ ధనమియ్యమఱివచ్చు
పోయినవరుఁడెటువుట్టివచ్చు
వైధవ్యమనువ్యాధివనితలు నైతురే
యున్నవారైనవారున్నవారె?

గీ. అకటకువలయాశ్వ యబలననాథను
నడవిపాలు సేసియతివనీవు
బ్రతుకువెతలబ్రతుకుకుక్షితిఁజిరాయువుగాఁగ
ననుచునన్ను విడిచియరిగితేర.

కువల:— (స్వగతము) ఏమి? "కువలయాశ్వ" యనినన్ను సంబోధించి పలికినట్టువినఁబడెను. భ్రమయింతటిదిగా నుండునా? వాక్యము శబ్దము అక్షరక్షరము వినఁబడుచున్నదే? భ్రమగాదిది నావ్యననప్రలాపంబులు నాయిలువేల్పులువిని యామదాలస మధురవాక్యంబులై ననువినిముదముఁజెందనిమ్మనియెంచి యామదవతిని పేఱొకశరీరంబునఁ బంపినారని తోఁచెడు. ధ్వనియాదిక్కునుండివచ్చినది. అటువోయియాసహజాలంకార దేహసౌందర్యముఁగల మంద

యానను వీక్షింతునా? స్త్రీలు విహరించు ప్రదేశంబది పురుషులు పోనగునా? వలదు వలదు. ప్రాణసతీ మదాలసా! కృత్రిమదానవుండు కుహనామునినై పలికిన యవాస్తవంబులు విశ్వసించి ప్రాణంబులు విడిచితివే! గజగమనా! ఇది తగునా?

మ. కరియానా! కపటాత్ముఁ డాడిన యలీకంబుల్ మదిన్నమ్మి యా
తురతన్ దేహము వాయఁగాఁ దగునటే? దోషంబుగా దే సఖీ?
యురుప్రేమన్నినుఁ జూచు వారెట్టులనీ యుర్వీతలంబందు ని
ల్తురు ప్రాణంబున? నింత నీవు మనమందున్నానఁ గావల్దటే?

మదా:— (స్వగతము) ఏమివిచిత్రంబిది! నాయొద్దకు వచ్చి నా ప్రాణపతి దుర్గతిఁ దెలిపిన వాఁడు కైతవ మునియఁట. వాని వచనంబు లలీకంబులఁట. ఇది నిజముండునా! ఆహా నిజమైనచో నా సంతసంబునకుఁ గొలంతలేదుగదా! నే మరణంబుఁ జెందితినని పలుకుచున్న వాఁడే? ప్రత్యక్షముగఁ నేఁ బ్రాణమునను౦డ మరణంబుఁ జెందితినను నది నిజంబునకు దూరంబుగదా! ఈ యశ్వతరుండు తన తపోమహిమచే నిట్టి యపూర్వవిచిత్రంబులు గల్పించి నన్నాడించుచున్న వాఁడని నాకుం దోఁచెడు. లేకున్న స్వర్గంబునందున్న ప్రాణపతి యీలోకంబునకు వచ్చి మాటలాడునా? ఇఁక నేలయీయాశ!

(మదాలసాయని దూరంబునుండి ధ్వనివినుట)

ఎవరో పిలుచుచున్నవారు ప్రొద్దైనది పోయెద.

(మదాలస వెళ్ళిపోవుట)

కువల:— ఏమియిది మదాలస ప్రత్యక్షంబుగఁ బ్రాణంబుననున్నదఁట. నే నేయవాస్తవంబు లాడితినఁట; హా హా! మదాలసా మరణంబు గన్నులారఁ జూచి యగ్నిసంస్కారాదులు నేసిన నాతండ్రి యబద్ధములాడియుండునా? లేక మజ్జనని యబద్ధము లాడియుండునా? పురజనులాడియుందురా? వీరందఱు మోసపోయిరని యనికొందము; అటులయిన నా మందిరంబుననున్న మదాలస రెటుపోయెను? అబద్ధము లేలయగు? నిజము నిజము; నన్నాడించుటకై యీ యశ్వతరుండు పన్నిన యింద్రజాలంబిది. లేనిచోఁ బరలోకంబుననున్న పుణ్యవతి మాటలాడు టెటుల? ఏరూపంబుననో యున్న మదాలస మాట లించుక వింటిని గదా! ఆ సంతసంబే చాలు ప్రొద్దాయెను. పోయెద.

అ ను బ ం ధ ము 34.

(నిష్క్రమము.)

## ద్వి తీ య ర ం గ ము.

## అశ్వతరుని మందిరము

అశ్వతరుఁడు - దేవలుఁడు - నాగలుఁడు - కువలయాశ్వుఁడు - మదాలస.

అశ్వ:— (కువలయాశ్వుని దిక్కుఁ జూచి.)

క. అసమానమానధన, యో
కుసుమాంబక రూపవిభవ, కుజనకుఠారా

పసితనమున నింతటివె
క్కసమగు వెసనంబునీకుఁ గలుగఁ దగునే.

రాజకుమారా! దురంతవ్యసనంబునకులోనై సగమైతివి. ఏవ్విధంబుననినున్నానందింపఁ బ్రయత్నించినను నాయత్నంబులన్నియుం బూడిదలోనిహోమంబయ్యె. నీతలిదండ్రులఁ జూడం బోవలయునని దినదినంబునను వేఁచుచున్నవాఁడవు. నిన్నేవిధంబునను సత్కరింపక పంపుట మానితంబుగాదు. నీమనోభీష్టంబెద్దియో యది వేఁడుము. తప్పక యిచ్చెద.

కువల:— మహానుభావా! మీయనుగ్రహంబున సర్వైశ్వర్యంబులున్నవి. సత్పురుషులగు మీవంటి వారికృపయున్నంజాలు. నాకేదియువలదు.

అశ్వ:— రాజకుమారా! సంకోచింపకుము. లజ్జింపకుము. ఎట్టిదుర్ఘటమగు కోరికయేనిం దైవానుగ్రహంబున దానినైనఁ దీర్చెద. వేఁడుము.

కువల:— అనుగ్రహాతిరేకంబున మీరిటులాడుచున్నవారు. నాకోరిక దుర్లభము.

అశ్వ:— ఎట్టిదుర్లభంబైన నేనిచ్చెద. ఇఁక నేలసందేహంబు. వేఁడుము.

కువల:— (దేవలనాగులదిక్కుఁ జూచి) సఖులారా! దుర్ఘటముగదా నాకోరిక. అదిమీరెఱుంగరా? అట్టిదినే నేమని వేఁడుదు?

దేవ:— జనకా! లజ్జచేఁ గొంకయున్నవాఁడు. నేనెఱుకపఱచెద వినుము.

గీ. పడఁతి యొకతె వీని ప్రాణంబుగానుండి
మరణమొందెఁ గపటమౌనివలన
దానిఁ దప్పవేఱు చానఁ దావొల్లఁడు
గాన దానినిచ్చి కావవలదె.

మదాలసేతర స్త్రీసుఖంబుఁ ద్యజించినాఁడు. ఆమదాలసను బ్రతికించి యిచ్చినచో మత్సఖుఁడు సుఖంబుననుండును.

అ ను బ ం ధ ము లేప.

అశ్వ:— రాజకుమారా! ఇదిదుర్లభంబని తలఁచితివా? దైవానుగ్రహంబున్నవారికి నెట్టిదిదుర్ఘటము గాదు. ఆమదాలస నే నేనిచ్చెద. (అనుచు మదాలసాయని పిలుచుట. మదాలసవచ్చుట) (మదాలసదిక్కుఁ జూచి) తనయా! ఇటురమ్ము. కూర్చుండుము (కువలయాశ్వునిదిక్కుఁ జూచి) రాజకుమారా! ఈనారిగదా నీదార సుగుణోదార. పతివ్రతాపంక్తిశ్రీకార. సహజాలంకార.

కువల:— మహాత్మా! రూపయౌవనంబుల నాప్రాణప్రియయగు మదాలసనుఁబోలినది.

అశ్వ:— పోలికయననేల? ఆమదాలసయే యిది.

కువల:— మహాత్మా! మరణంబునొందిన మదాలసయెటు మరలవచ్చెను?

అశ్వ:— క. ఘనమగునీ వ్యసనముమ
త్తనయులువినిపింప నేనుతహతహపడిరిగా
శునిఁగూర్చితప మొనర్చితి
వనితనుబ్రతికించె భక్తవత్సలుఁడుదయన్.

కువల:— తండ్రీ! నాపైఁబుత్రవాత్సల్యంబు దమకతిశయంబని నేనెన్నెద. నావచనంబులించుక క్షమింపవేఁడెద.

చ. ననుక్షమియింపవేఁడెదను నాగవరా! ననునూఱడింపఁగా
మనమున నెంచి బూటకపుమాటలు వల్కినవిశ్వసింతునే?
ఘనమవునే తపో మహిమగాని; గతాసువులేమిరూపయా
వనమునఁబూర్వ భంగిఁగడుభాసిలుచున్ననుతే మప్రాప్యముల్.

తండ్రీ! దైవానుగ్రహంబెంతయున్న నిట్టిధికమువిచిత్రంబు, అవిశ్వసనీయంబు. ధీరత్వంబునా యందించుక యున్నయది.

క. మానసమున ననువిషయా
ధీనునిఁగా నొతపోనిధీ యెన్నుచునా
మానినిరూపంబునవొక
చానసురప్పించిగేలి సల్పఁగఁదగునే.

మరణంబునపొందిన మదాలసను మరల నదేరూపయావనాదిగుణంబులు గలిగియుండునటుల బ్రతికించినది నేనునమ్మను. ఇదినిజముగమదాలసగాదు.

అశ్వ:— (మదాలసదిక్కుఁజూచి) తనయా! కువలయాశ్వునిదారవగు మదాలసవీవుగాదని పలికెడు. అదినిక్కమేనా?

మదా:— ఉ. కీలినిఁ గేలనుంచికొనికేడ్వడకేనిటచాటిఁదెల్పెదన్
బాలశశాంకమౌళినయిభాసయొనర్చెద నేమదాలసన్
తాళఁగలానెనీవిటులతప్పులుపల్కితివేలతండ్రిరో
చాలునుచాలు నేనెపుడుసచ్చితి? బూటకముల్సహింతునే.

తండ్రీ! నేనేయామదాలసయనుట కెట్టిసంశయంబులేదు! ఈశ్వరునింగూర్చి తపంబు నేసి నన్ను బ్రతికించితివనివచించితివే. అదియ వాస్తవంబుగదా! నేమరణంబొందినదెపుడు? నీవు నన్ను వరంబునఁగొనినదెప్పుడు?

అశ్వ:— ఆయుదంతంబుఁ దెలియనించుక నిదానించుము. తనయా! ఈరాకుమారుండు నీపురుషుండగు కువలయాశ్వుఁడుగదా!

మదా:— తండ్రీ! నన్నేలయీరీతిఁబ్రశ్నించెదవు?

క. జనకా నాప్రాణప్రియుఁ
డనిదానవుచేతఁజచ్చెననిమౌనిపరుం

దనెమఱిపోరంబిచ్చెను
మనెనెట్టుమత్ప్రియుఁడుసకలమహినిట్టుగలదే.

తండ్రీ! ఇట్టివిచిత్రంబులెందునుగలవే? ఆమునికపటాత్ముండైనచో నాపురుషునిగ్రైవేయకంబు వానికెటువచ్చె? హరి హరీ; నాఁడునిరూపంబున నున్నంతమాత్రన నాపురుషుండగునా? అటులెంచినచో నేఁబతివ్రతనగుదునా! వలదీమాటలు.

క. నేనెట్టునమ్ముదుతండ్రీ
ప్రాణప్రియుఁడకట నాఁకెపంచతనొందెన్
మానవుఁడొకఁడారూపముఁ
బూనినచోఁబురుషుఁడనఁగఁబోలునెసతికిన్.

వలదుతండ్రీ! యిట్టిమాటలువినఁజాలను.

అశ్వ:— కువలయాశ్వా! ఈసతిపలికినమాటలు వింటివిగదా!

కువల:— మహాత్మా! శత్రుజిద్వరుని వరపుత్రుఁడను నేననుటకు నెట్టిసందియంబు లేదు.

ఉ. ఆనరభోజిచేమరణమందెనునీప్రియుఁడంచుకృత్రిమం
బూనివచింపఁబుణ్యసతి, యొప్పునియావచనంబువెంటనే
ప్రాణముఁబాసెవ్యర్థముగఁబ్రాణవిభుణ్ వ్యసనాబ్ధిఁద్రోసెన
య్యానిజమీయుదంతమనియాపెద్దదైవమునాకుసాక్షిగాన్.

ఆకువలయాశ్వుఁడను నిర్భాగ్యుఁడు నేను. దానికేలసంశయంబు.

అశ్వ:— ఏమిచిత్రంబిది. ఒకరినొకరు నమ్మకయున్నాము. ఈసతిమరణంబునొందినది నిజమని నేఁ బలికెదను. ఈరాకుమారుండుపలికెడు. ఆది మదాలసయొప్పదు. మరణంబునొందినదానిని తపంబుచే నేఁబ్రతికించితినని నేఁబలికెదను. వీరిరువురదినిజమనియొప్పరు. వేరోల? ఇది. మదాలసయనునది కువలయాశ్వుండొప్పఁడు. వీఁడుకువలయాశ్వుండని మదాలసయొప్పదు చిరకాలవియోగకారణంబున వీరికీసందియంబుగలిగినది. అదియునుఁగాక పరస్పరమరణో దంతంబు వీరిమనంబున దృఢముగానిలిచినది. వీరిధర్మసందేహంబు దెలుప ధర్మదేవతతరమవును గాని నాతరముగాదు. ఆదేవతనుస్తుతించెద; ధర్మదేవతా! అశరీరవాణీ!

సీ. తనభర్తసభలోనఁదనదేవికాదనఁ
దరుణికిసాక్షి గాఁదనరితీవు
తనకేనలేదనితలఁచినమౌనికి
ధర్మములోర్బోధించితనరితీవు
అతిథివైయాయోఘవతిపతివ్రతయని
ధవునకునెఱిగించితనరితీవు
భూసురుండిచ్చినపూరిగింజలుదిని
తగఁబహుపదమిచ్చితనరితీవు

గీ. ధర్మదేవతయను పేరఁ దనరితీవు
నిర్మలాకాశరూపివై నిలిచితీవు
ఎట్టిసందేహములనైన నెలమిఁదీర్చు
రీతినీయందుగలదశరీరవాణి.

చ. నినునుతియించి నేఁడెదను నీదుకృపారసమొల్కఁబల్కవే
యనుపమశూరుఁడా కువలయాశ్వనృపాలుఁడు వీఁడెగాదె? యీ
యనఘునిదార యీసుదతియౌనుగదా? గతజీవయైనయీ
వనితసజీవయయ్యెఁగద భర్గునిచే వివరించి తెల్పవే.

ధర్మదేవత:—(యశరీరవాణియై పైనుండి)

వత్సా! అశ్వతరా! నీధర్మబుద్ధికి నిర్మలమానసంబునకు నేమెచ్చితి. ఈరాజకుమారుండు శత్రుజిత్పుత్రుఁడు. కువలయాశ్వుఁడు. ఈరాకాసుధాకరముఖి మదాలస. కువలయాశ్వుని భార్య. తాళకేతుండను దానవాధముండు కైతవమునియై యాకువలయాశ్వుని వంచించి గ్రైవేయకంబుఁగొని మదాలసయొద్దకుఁజని పతిపరలోకగతిఁబొందెనని వచించె. ఆపలుకు వెంబడి యీపతివ్రత ప్రాణంబులుఁబాసె. తదనంతరంబునఁ గువలయాశ్వుఁడువచ్చి తనసతిమరణో దంతంబువిని స్వప్రాణంబువదల సమకట్టియొట్టకేలకు నదిపాపంబనియెంచి పరస్త్రీసుఖవిముఖుండయ్యెఁగాని యాసతీవియోగదుఃఖంబు వాయఁడయ్యె. నీసుతులువానిసఖులుగాన వానిదుఃఖంబుసహింపఁజాలక నీకుందెలుపనీవత్యుగ్రతపంబునేసి యుగ్రునిమెప్పించి యిక్కన్యనుసురుచిర వయోధన్యను. లాలితరూపలావణ్యను మరలపూర్వరూపంబున బ్రతికించి నీనందనుఁబలె నానందించుచుంటివి. ఈపుణ్యసతిప్రాణంబు లాకస్మికంబుగఁబోయెనుగానఁ దనమరణంబు దానెఱుఁగదయ్యె. చిరకాలవియోగంబునంజేసి యీసుదవతి మదాలసయని కువలయాశ్వుఁడు పలుకనేరఁడు: వత్సా. నీమహదుపకారబుద్ధింజేసి యీవధూవరులకు మితిలేనిముదముగలిగె. అకళంకంబగుస్నేహంబు సకలార్థదంబనుటకు నీపుత్రులు. పరమపవిత్రులు. దార్క్యాణభూతులై ఈవధూవరులు చిరకాలంబు పరమసుఖంబు లనుభవించి పరమపదంబొందెదరుగాత.

(ధర్మదేవత నిష్క్రమణము.)

కువలయాశ్వుఁడు:— (ఆనందబాష్పంబులువిడచుచు.)

మహానుభావా! నీమహిమ నేనెంతనుతించినను దీఱదు. నీఋణంబునుండి నేనేరీతి ముక్తుండయ్యెదనో దోఁపకయున్నది.

ఉ. చింతలవంతలన్దవిలి చిందఱవందవో మదాలసా
కాంతకుఁబ్రాణముల్వదలఁ గాఁగనుచున్న మదీయచిత్తముఁ
సంతసమన్న ముద్రమున స్నానమొనర్పఁగఁజేసితయ్య నీ
వెంతపరోపకారమతి వెందునదీర్తును నీ ఋణంబికన్.

మహాత్మా! నీఋణంబుదీర్ప నేరనుగానఁ ద్రికరణశుద్ధిగా నమస్కారంబు లొనరించెద.

మదా:— తండ్రీ! సర్వకార్యధురంధరుండగు నాపురుషుండు నీఋణంబుదీర్పనోపనిచో నబలను నే నెటు దీర్చుదు. జనకా! నీకరుణయొంతఘనంబో

సీ. కనిపెంచిప్రీతిగాఁ గన్నతల్లికినైనఁ
గలుగునేయింతటికరుణ యెచట
ధనధాన్యములనిచ్చు తండ్రికినైనను
గలుగునేయింతటికరుణ యెచట
వెన్నంటిపుట్టినయన్నదమ్ములకైనఁ
గలుగునేయింతటికరుణ యెచట
అర్థాంగినాబాసయనియెడిపతికైనఁ
గలుగునేయింతటికరుణ యెచట

గీ. ఏఋణానుబంధమించుకేనియులేక
యధికకష్టతపమునమరఁగాంచి
జీవదానమొసఁగిచింతలుఁబాపిన
తండ్రినీదుఋణముదరమెతీర్ప.

జనకా! ఈయకారణకారుణ్యంబు వెల్లడించి ననుమరలబ్రతికించి నాప్రాణపతిం జూపిన నీయుపకారంబునకుం బ్రతి, నానమస్కారంబుఁదప్ప వేఱొయుపకృతి సేయఁగలను? (నమస్కారంబు సేయుట).

ఆశ్వ:— (వధూవరులను గూర్చుండనియమించి)
రాజకుమారా! మీయిరువురకు మరల పరిణయమహోత్సవంబుజరప నాకుఁగుతూహలంబయ్యెడు. అందులకు రేపుశుభదినంబు ఇపుడుప్రొద్దైనది పోదము.

(నిష్క్రమణ.)

తృతీయరంగము.

సూత్రధారుఁడు.

ద్విపద.

వింటిరేమీరీనవీనచరిత్ర
కంటిరేదైవయోగంబెంతఘనము
గంధర్వకులపతి గారాబుపట్టి
గంధేభగామిని కామినికన్య
వనితలజతగూడి వనకేళిలోన
ఘనహర్షమునుజెందెఁ గాదె; యంతటనె
క్రూరరాత్రించరు ఘోరకృత్యమునఁ
గారానికష్టము ల్గనెఁగాదె; మరల
భూవిభుకొమరుఁడు భూరివిక్రముఁడు
జీవనాధారుగాఁ జెన్నొందెఁగాదె

పతిమృతి వినికుంది పంచతనొంద
సతి పునర్జన్మంబు శంకరు కరుణఁ
గని, తనపతిఁ గూడెఁ గాదె మోదమున
ఘనులార దైవయోగం బిదిగాదె
ముదము సుఖము సుఖేచ సుఖము నుగతము
మదిఁ దలపోయఁగ మానవు వశమె
వారిజనేత్రను వరియించి తెచ్చి
భూరియత్నంబుల భోగింప నెంచి
దారపుగమ్మని దానవేశుండు
ఘోరప్రాణంబులు గోల్పోయెఁగాదె
మునియాగరక్షణ మునకుఁ దావెళ్ళి
మనుజభక్షకుఁ ద్రుంచి మానవేంద్రుండు
కని విని యైనను గానని యట్టి
ఘనితసుసుగుణాల కన్యనుఁ గాంచి
తనదేవిగాఁ గొని తనరెను మహిం
ఘనులార దైవయోగం బిదిగాదె
సతివార్తవిని దుఃఖసాగరంబునను
పతి మునుంగుచు భోగబాహ్యుఁడై యుండ
నన్న్యలోకమునుండి యవనికేతెంచు
ధన్యులా యహిపతి తనయులు వాని
చెలులుగా నేస్తఁడి చింతనుగతము
దలపోసి దుఃఖించి తహాతహానొంది
వినినంత తంద్రికి వినిపించి రదియుఁ
గననహా దైవయోగంబునఁగాదె
వినినంతమాత్రన విశ్వాసమూని
ఘనుఁడు ఘోరతపంబు గాంచి శంకరునిఁ
గొనియాడి మెప్పించి గొని మదాలసను
మనమలరారఁగ మమతతోఁ బెంచె
ఘనులార దైవయోగంబునఁగాదె
వినిదీని నమ్మని వెఱ్ఱులుగలరె?
కువలయాశ్వునిఁ బోలు కూరిమిభర్త
భువిమదాలసఁ బోలు పుణ్యచరిత్ర

వింటిరే మీరిట్టి వింతచరిత్ర
అకళంకమూర్తియు దారమానసుఁడు
సకలసౌభాగ్యత సరిలేక వెలసి
తనసతిమృతివిని తపియించుచుండె
ననవరతముగాని యన్యమానినినిఁ
గూడిసుఖంబులు గోరనేమదిని
జూడుడీయిదియెంత సుగుణంబోభువిని
పతిమృతివినినంతఁ బరితాపమొంది
సతిశరీరముబాసి సద్గతినొందెఁ
గానివేఱొక్కనిఁ గాంక్షించిసుఖము
బూనె నేయిదియెంత పుణ్యంబోజగతి
సంతసంబుననుండ సఖులనివచ్చి
వింతగునెయ్యంపు విందులనంది
వంతఁగుందెడుతటి వలవనిలేని
మంతులారసిచెడు మాటలనాడి
హేళియొనర్చెడి హితులుందురాహా
మేలుగీడులయందు మేదినియందు
నొకరీతినుండువా రొక్కరైనఁగలరె
వికటసంకటమంది వెతఁగుందుతఱిని
స్నేహంబురెట్టింపఁ జేసినవారె
స్నేహితులౌదురు స్థిరమదిగనుఁడి
తమకెంతచెడుపైనఁ దలఁపకపరుల
శ్రమఁబెట్టుతుల్లకజనులుందురవని
తమకునష్టములేక తగనితరులకు
శ్రమయిచ్చిబాధించు జనులుందురవని
తమమేలుగన్నఁగోని తగనితరులకు
క్రమమొప్పఁగామేలు గలిగించుజనులు
గనఁగొందఱుందురు గానియీభువిని
ఘనసౌఖ్యమునుఁబాసి కాననంబునను
దనమేలునెంచక తలఁపకకష్ట
మునకుఁబాల్పడిదేహ మునుబోయఁబూని
పరునకుమేల్గోరు పరమోపకారిఁ
దరమెయొక్కనినశ్రీ తరుఁబోలువాని

గననిధి యెంతటి కరుణయొ గాని
వినికని యెఱుఁగని వింతలహా ర్త
ఈయశ్వతరుఁడెట్టి యీడితాభ్యుండో
కాయంబు హేయంబు గాఁగనితపము
బూనిరాసుతునకుఁ బూఁబోణినిచ్చి
యానందమెసఁగఁగ ళ్యాణంబుసేయ
సమకట్టెఁగాననీ సమయంబునందు
శ్రమ యెన్నకల్లన జనులారపోఁడు
ఘనులనుగన్నారఁ గనిహర్షమంది
మనము వేవేగమే మరలి రాఁగలము
పోదమురండియో పురజనులార
యీదినమునుదప్ప యింతటిపుణ్య
దినమబ్బునే? వెను దీయకరండి
మనమలరారయో, మహీజనులార.

(నిష్క్రమము.)

## తురీయరంగము.

కువలయాశ్వుఁడు, మదాలస పెడ్లిపీటలపైఁగూర్చునియుండుట.

అశ్వతరుఁడు - దేవలుఁడు - నాగలుఁడు - బ్రాహ్మణులు - ముత్తైదువలు.

బ్రాహ్మణులు ముత్తైదువలాశీర్వదించుట.

* బ్రా. మానినిశిశుపాలున కిచ్చెదరను మాటలువీనులఁ బడిచింతన్
మానెనుసఖిసౌఖ్యము లన్నియునిఁక మానునొప్రాణముపయియాశల్
భూనుతచరితా నినురమ్మనెనను భూసురువాక్కులు వినివేడ్కన్
మానినికిముదంబును గూర్చినహరి మక్కువమోదము లిడుగాతన్.

క. మణినెపమునభల్లుకమున కునుదర్శనమొసఁగివానికూర్మితనయున్
గొనినహరిమీకునిడుతన్ ఘనముగదాంపత్యసుఖముగలకాలంబున్.

చ. ఇనుఁడువరంబుగానిడినయీడితరత్నవరంబునక్కటా
గొనియెనుసోదరుండనిమికుత్సితబుద్ధినిఁగృష్ణుఁడంచుఁదా
నని యెఖలుండటంచుమణినారసియిచ్చితదీయకన్యకా
మణినిగ్రహించిమించుహరిమంగళమియ్యుతమీకునెల్లెడన్.

క. వనజాక్షునిఁబతిగాఁగొను తనయాయనుతరణిపలుకుఁదప్పకతపమున్

* రుక్మిణీవృత్తము. భసానజానగాగణములు. 23వ-ఛందస్సునఁబుట్టిన [2028135]. వృత్తము. 14 యక్షరముయతి.

గనియున్న చెలిని సతిగాఁ గొనుమహారి యిడుఁగాత మీరుకోరినకోర్కెల్

చ. అనుజులునీదు పేరనిననాజ్ఞ్యమువాసిసియగ్నికై వడిన్
గనలుచునున్న వారు; పతిగానినుఁగోరెదునామనంబు; మ
జ్జనకుఁడువారి నేమనఁగఁజాలఁడుముం దెటులౌనొ కార్యమం
చను చెలిదాఁగాఁగొనినయాహరియియ్యుత మీకుసౌఖ్యముల్

సీ. మునివరుఁడట కేలచను దెంచి
ఘనువార్తవినిపించె పీనులతనివిచిత
వినిపించెఁగా కేమివినినంత వాసికై
చను నెనేఁ తంటివనటఁ గుంద
వనటఁగుందినఁ జూచి జనకుఁడు వృషభంబు
లనుగట్టువాఁడెబో తనయకిష్టుఁ
డని చాటగా నేల, ఘనబుక్షములఁ గట్టఁ
జను నెయెంతటివానికిని జగతిని

గీ. వనజనయనుండు భర్తగాఁ గొనుచు హర్ష
మునను మని యెడుభాగ్యముగనుట యెటుల
య నెడువనితకు మోదంబులొనరఁగూర్చి
తనరుహారి మీకునియ్యుత తనివి నెపుడు.

ఉత్సాహం. కనికరంబుఁ గనికరంబు వైకొనన్ స్వయంవరం
బునకు రాకనిలిచె నేల పుణ్యపురుషుఁ డక్కటా
యను చుఁదలఁచు వనితఁ జేరి యనునయించినట్టియా
వనజనయనుఁడొసఁగుఁగాత భద్రముల్ సమృద్ధిగాన్

చ. వినయవిదూరులైన పృథివీవరులందఱు జుట్టిముట్టినన్
ఘనసితకాండజాలములఁ గండలుడుల్చి మరల్చి లక్షణన్
మనమలరంగఁ జేసిన రమాధవుఁ డీయుత మీకు వస్తువా
హనధనముల్ చిరాయు నిరామయముల్ సుఖభోగ్యభాగ్యముల్.

ముత్తైదువలు హారతి యెత్తుట.

అ ను బ ం ధ ము 36.

మంగళమహాశ్రీవృత్తము.

శ్రీసతినిహృత్కమల సీమ, రవిసోములను జెన్నలరుకన్నుఁగవయందా
వాసముగఁ జేర్చి, విధివాసీగను నాభినిడి భాసిలుచు లోకములఁ గుక్షిన్
భాసమునుఁ జెందఁ జేయు మోఘముగఁ బ్రోచు హరి మోదమిడు దంపతులకంచున్
భాసురలతాంగులిటు భావమునఁ గోరుచును బాడెదము మంగళమహాశ్రీ.

( నిష్క్రమము. )

# (Appendix)—అనుబంధము.

## అనుబంధము 1.

### మాండురాగము - ఆదితాళము.

సూత్ర:— శ్రీశదేవదేవ శేషశయనా ధాపవీళయితపంకజేక్షణా । ప ।
వరదభక్తికేకిశరదహరిఖవాతరనాలరిపుదహరణ శుభకరణ ॥ ౧ ॥
పరమమంగళా సంగసుందరాంగకరిరాజకష్టహరణపావనా
నిరతశ్రీనివాసుకవిపోషణాసరిసగానలోల సారవేదఖేల ॥ ౨ ॥

## అనుబంధము 2.

### బేగడరాగము - ఆదితాళము

నటి:— వనసారభాసురమ్ముగనువసంతవిభవము మనమారమానినీవినోదమహితశుభములు ॥ ౧ ॥
అరవిందకుందసుందరమ్ముఆరెధవనము కురువిందకుటజకోమలమ్ముకూడెగానము ॥ ౨ ॥
శుకశారిపైకశోభితమ్ముసాఖ్యసాలమూ అకళంకవారిజాకరమ్ముహాయికాలమూ ॥ 3 ॥

## అనుబంధము 3.

### మాలకంస్ రాగము - త్రిశ్రగతితాళము.

పాతాళ:- ఎవ్వాడకో ఎవ్వాడకో అవారిగానుమాటలాడకూసెదానవారినీ । ప ।
వానినీ వారిధీ కూల్చెదా చీల్చెదా ॥ ౧ ॥
మానులాగొనులానూనకాదంపెదా కర్మలాగిష్మలాకలచెదా దొలిచెద ॥ ౨ ॥

## అనుబంధము 4.

### హిందూస్థానితోడిరాగము - రూపకతాళము

పాతాళ:- సుందరికినిగననుయిలను పొందగవశమే । ప ।
ఈజగతీఆసుదతీయెనగనవశమే । అ ।
చారుతరాసారసమా నారిపదనమూకరియానము కామినియానము మోదకరాముసంతతము ॥ ౧ ॥
నారీమణీనాసగనా నారకనకమూ సరిపానముయీ చెలినేత్రము తారినిజాముసమ్మదము ॥ ౨ ॥

## అనుబంధము 5.

### హిందూస్థానిపీలురాగము - ఆదితాళము

ప్రలం:— సారసాక్షికోరాగనుగాదెసుముదము గాదెసుముదముఅదికాదెసుముదము । ప ।
నీరజవాణీనీలవావేణీ మారమోహనాంగిజాడగాదెసుముదమూ ॥ ౧ ॥
సుందరవదనముకుందరదనముల మందహాసమొప్పగనగాదెసుముదము ॥ ౨ ॥

## అనుబంధము 6.

### హిందూస్తానికనడరాగము - రూపకతాళము

పాతాళ:—సాధింతునుశక్తిజూపిచాలని దేవేధింతును భూమినెల్లవేగమిదే ॥ ౧ ॥
కర్మఠులగారించుచు కాల్తునిదే పేర్మి పొచ్చసుఖముల ద్రాల్తునిదే ॥ ౨ ॥

ఆగమమార్గాగతులా ఆర్చెదరుద్రమేశ్చదాను
భోగులనూ యోగులనూ జోగులు గాచేసెదనూ ॥౨॥

## అనుబంధము 15.

### హిందుస్థాని రాగము - ఆది తాళము.

గాలవ:— కృష్ణా దేవకీనంద నాయాదవకులరక్షణా । ప ।
నందసునందనమందరగోవర్ధనసుందరకంజవదానమదనా ॥ ౧ ॥
గోధనపాలనగోపికమానధన గోవర్ధననారాయణామునరా ॥ ౨ ॥
కమమాన్య మేరక పామానవకన్యకును మరిమానవభక్షకులీనానదెందేవి
ఖిదాలమూషికలకెక్కలపెందువిరుద్ధమారయుః

## అనుబంధము 16.

### చక్రవాకరాగము - రూపకతాళము.

శత్రు:— నాతలయరా మోదమాయెను రాఘనముగనుమానసము । ప ।
రాత్రిచరులఘాతిగెడపిరారాజిలారాష్ట్రపతిగయశముయొల్లదిశలనిల్వనిజముః ॥ ౧ ॥
విజయవైభవముననీవునినుతిని కొండిఅజిరరాజ్యవిభవసౌఖ్యమందిరునుక్షోణిం
వీరరారశూరనామపురికినిహృదంబుజంబునముసంబుగనిరెను.

## అనుబంధము 17.

### మాలకంసరాగము - ఏకతాళము.

ఋతుధ్వ:—రారాదురమునసిలువుము వేగా ధీరవృత్తినీనిలువరదురమునతిరముగ
పాతా:— పోరపలుకకుయిటువలెనీవుశూరధర్మమునలుపుదునిలువరదురమున
ఋతు:— ఇదే యాదుపదునగుశరముగదియునునిన్ను పదిలముగానునిలువుమనీప్రా
మాటలేలిక దిటముగనిటునిలుకుటిలుడ
పాతా:— పలువాలబలెనిరవలమాపలుకగనీకుఫలమగు నేను
చలమును మీను చాలువీశరములువ్వాయపరవకునెరపకు
ఋతు:— శూరునీవ లేపోరుగోయదేచేరరాలుటుదురుమున
నీగురువులము నేలపాలశేయువాడుబాలునునీదుపలుకకు
పాతా:— మల్లయుద్ధముచెల్లుపోలు కాముల్లకాధమానిలునిలు
కారులుపలుక నేలచాలు మేలుకాదుఅల్లమునాననిల్చుపుదు.
ఋతు:— ఓరీపలుకకురా రారాదురమునవీవీరాయతబలమూనీరూరగనలిక్షీ

## అ ను బం ధ ము 22.

కాపిరాగము - ఆదితాళము.

కేవల:— కురుబాధాచాలా ఆయెనుయిక మననుభుపనీమీవిరియోగాము ధరింపక సౌఖ్య మే నాకు
పాపి శైవమాగ టినిజేసెనన్ను ఆక్రొటూ బ్రహ్మ వ్రాతా కొటనంగక
యేరికైనా సౌఖ్య మే నేనోపచాలను ఈమాయలాపము ॥ ౨ ॥

## అ ను బం ధ ము 23.

శంకరాభరణ రాగము - ఆదితాళము.

ప్రులం:— కువలయాశ్వనినెన్న తరమెకువలయంబునా కువలయంబనువాజి చేతనుభూమిని వెలయరా । ప
భూరివిక్రమచండభానుడుమావరూపుడూధీరనేఖరుధీవిశేషము తెలియుగవశమే ॥ ౧ ॥
భాసురంబుగరాక్షసావళిపారదోలుచు నాశనంబు శేయువాడువాసు దేవుడూ ॥ ౨ ॥

## అ ను బం ధ ము 24.

తోడిరాగము - ఆదితాళము.

శత్రు:— తాళాజాలాతనయాదయూజ్వలా వెలరాయనీమోము వెలియూపనాడో
పరలితపములుపరగనెన్న చేసే, కరసూసీన్నొందపరిధవిల్లితిచాలా ॥ ౧ ॥
ఆభాగ్యమదిపోయి సర్భాగ్యుడై రసనద్భాగ్యశాలిసకొన్న నన్నెటుగాంతు ॥ ౨ ॥

## అ ను బం ధ ము 25.

రాగము                    తాళము.

కేవల:— నాకునింకేదీ ఆరోగ్యసుఖముకలదు । ప ।
బారయుపోయెను భారుణిభారమాయెను క్షితి నేనిలుచుదారిగానసుచను నేమేను ॥ ౧ ॥
డెందముక్షుండెను సుందరీవీడిపోయెను సుఖమెయిక నుపొందగానసుచను నేమేనూ ॥ ౨ ॥

## అ ను బం ధ ము 26.

రాగము                    తాళము.

కేవల:— చింతనొందగా యంతమూఖకామయ్యా అంతరంగమందూవంత మానుమయ్యా

మనసేలభామినీ గనలేనుసోకసే
తనుప్రాణనాథునా తెలపెదనా

అనుబంధము ౭౫.

హిందుస్థానియమన్ రాగము - ఏకతాళము.

అశ్వ:— మతకానవెయంతో సంతోషసమయము నేడు ||ప||
యిదిమర్గభంబనితెలంచితి నమదిమందునీవు అనుదినమున
అందూసుఖంబు దైవంబును భజింపుము ||౧||
నీమనసతినాదుగృహమందు భూమి మోదమంద భూమిమూవమునా
నుందుఆసుందరినీపొందుసూ గోరుచునూ ||౨||

అనుబంధము ౭౬.

ఝంఝూటి రాగము - రూపకతాళము.

శ్రీవరా మురా సురా హరా కరుణా భరణా
నిజభక్తభరణ చారుతరుణ శోకహరణ ||శ్రీ||
నీకోమల పదసారస భక్తివాసముజా నీ
కైవల్యపదసౌఖ్యము ప్రాకటముగనుజా
నాకునోసంగముకరుణజా జొచ్చితినిశరణజా నాకీ
వినుతా కరిసౌఖ్యకృతా సూవితతా దీనహితా వేదనుతా ||శ్రీ||

# ప్రకటన.



బళ్లారిలో వకీలుగానుండిన కే. శే. కోలాచలం శ్రీనివాసరావుగారిచే రచియింపబడిన యీ క్రింద వివరించిన యుపన్యాసములన్నియును విక్రయమునకుసిద్ధముగనున్నయవి

| | | |
|---|---|---|
| 1. | ఆర్యుల నాగరికతవారి ప్రపంచవ్యాపకత. | 0-8-0 |
| 2. | ఆర్యుల చరిత్ర, ఋగ్వేదభాష మొదలగునవి. | 0-8-0 |
| 3. | ఋగ్వేద విభజన వేదకాల విభజన మొదలగునవి. | 0-8-0 |
| 4. | ఆర్యులుపంచాబు చేరిన విధమువారిశాసనము. | 0-8-0 |
| 5. | మద్యపానము జూదము స్త్రీలగుణములు మొదలగునవి. | 0-8-0 |
| 6. | వివాహకట్టడములు ... | 0-8-0 |
| 7. | జాతిచట్టములు ... | 0-8-0 |
| 8. | సృష్టిని గురించిన తాత్పర్యము. | 0-8-0 |
| 9. | వేదమతము నాస్తికమతము ఆర్యులదైవములు. | 0-8-0 |
| 10. | నరమేధ అశ్వమేధాది యజ్ఞములు. | 0-8-0 |
| 11. | అదితి ద్వాదశాదిత్యులు మొదలగునవి. | 0-8-0 |
| 12. | యమ యమి మృత్యువు పితృదేవతలుకర్మ మొదలగునవి | 0-8-0 |
| 13. | సోమపానము అశ్వినులు రుద్రుడు పర్జన్యుడు. | 0-8-0 |
| 14. | ఋషులు, సప్తర్షులు, దధీచి, చ్యవనుడు మొదలగునవి. | 0-8-0 |
| 15. | ఋగ్వేదములోని ముఖ్యప్రార్థనలు | 0-8-0 |
| 16. | [illegible] బ్రబలినది ... | 0-8-0 |

కావలయువారీ క్రింది చిరునామాకు వ్రాయవలయు.

కే. శత్రుఘ్నరావు,

సివిల్ రెవిన్యూ, బళ్లారి.